1967 మే—జులై



V. L. Narasimha Rao



(త్రైమాసిక)

## రక్త చలన సంగీత శ్రుతి

నా నెత్తురు వాడికత్తి
నా బ్రతుకు కన్నీటి వొత్తి.
ఇన్నాళ్ళూ
కరువులోని అధికమాసం
నా నివాసం.
ఇప్పటికీ
దుమ్ముకొట్టి, బూజుపట్టి
నెత్తురు గడ్డకట్టిన లోకంలో
నా ప్రయాణం.
నిన్న
నా గౌరవం నలిగి
ఎద పలిగి
రక్తం! రక్తం! ముక్కలైపోయింది.
ఇవ్వాళ
సంధి వచనాలతో
శాంతి వచనాలతో
దొంగముసుగు కప్పుకొని
సంఘం నీడ
నా మీద పరచుకున్నది.

తిండీ, గుడ్డా, గూడూ
ఏది, ఎప్పుడు, ఎక్కడ?
సామ్యవాదం ఎన్నికల
పాసంగం కట్టిన తక్కెడ!
అడుగులో అట్టడుగులో
రుధిరపు మడుగులో
సామాన్యుని నినాదం.
నీతి ధర్మాల వ్రణాలపై
దోమలు ముసిరి
విసురుకోలేనంత
అసహాయమై మూల్గుతోంది
సంఘం.
నాలోని వెలుగుతో
ఈ నీడ చెరపి
నా నెత్తుటి వాడితో
ఈ వ్రణము చీల్చి
రక్తచలన సంగీత శ్రుతి
రేపు వినిపిస్తాను.
నేను భవిష్యత్తు మనిషిని
రేపు కనిపిస్తాను.



నిర్వహణ
'సాహితీ మిత్రులు'

వెల: ఒక రూపాయి.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

(త్రైమాసిక)

3

1967 మే—జులై

సంపాదకుడు

వరవరరావు



నిర్వహణ

'సాహితీ మిత్రులు'

## సూచి:



కవర్ కవిత – జి. ఎమ్. చంద్రం



## 'సాహితీ మిత్రులు'

(1966 జూన్‌లో 'ఆధునిక సాహిత్యవేదిక'గా 'సృజన'ను నిర్వహించాలని సంకల్పించిననాటినుంచి నేటి వరకు తమకు తోచినంత (ఐదు రూపాయలు మొదలు కొని నూరు రూపాయలకుపైగా) ఆర్థిక సహాయం చేసినవారి పేర్లు కృతజ్ఞతా సూచకంగా ప్రచురిస్తున్నాము. ఈ పాత 'మిత్రుల' సహకారం ఇట్లేకొనసాగి, ఇంకా ఇతోధికంగా కొత్త 'మిత్రులు' చేరుతారని ఆశిస్తున్నాము. నెలనెలా పది రూపాయల చొప్పున చెల్లించేవారే కాక ఏ రూపంలో ఏ సహాయం చేసేవారినైనా సృజన 'సాహితీ మిత్రులు'గానే సంభావిస్తుంది. అయితే వారందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు చెప్పుకోలేకపోవచ్చు. 'ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు')

| | |
|---|---|
| శ్రీ డి. జనార్దన్ | అన్నవరము, జి॥ నలగొండ. |
| శ్రీ కె. రవిబాబు | కడప |
| శ్రీ ఎం. వేంకటేశ్వర్లు | కర్నూలు |
| శ్రీ మనమోహన సహాయ్ | ,, |
| శ్రీ ఎల్. పుల్లోజిరావు | జడ్చర్ల, జి॥ మహబూబ్‌నగర్. |
| శ్రీ జి. వి. ఎల్. ఎన్. విద్యాసాగరశర్మ | ,, |
| శ్రీ పి. మల్లికార్జునరెడ్డి | ,, |
| శ్రీ టి. నాగేందర్ | ,, |
| శ్రీ సి. నరసింహరావు | ,, |
| శ్రీ డి. బ్రహ్మయ్య | ,, |
| శ్రీ వరవరరావు | ,, |
| శ్రీ తిరుపతయ్య | జమ్మికుంట, జి॥ వరంగల్ |
| శ్రీ డి. మల్లయ్య | నలగొండ |
| శ్రీ జి. రామరెడ్డి | నవాబ్‌పేట, జి॥ వరంగల్ |
| శ్రీ ఎం. వి. ఎల్. నరసింహరావు | నూజివీడు, జి॥ కృష్ణా |
| శ్రీ ఆర్. విద్యాసాగరరావు | న్యూఢిల్లీ |
| శ్రీ డి. నరహరిరావు | ,, |

| | |
|---|---|
| శ్రీ ఆవంత్స సోమసుందర్ | పిఠాపురం, జి॥ తూర్పుగోదావరి. |
| శ్రీ బి. నళినీకాంతరావు | మద్రాసు |
| శ్రీ సి. ఎచ్. లక్ష్మణరావు | రాయధారి, జి॥ ఆదిలాబాద్. |
| శ్రీ వే. నరసింహారెడ్డి | హనుమకొండ |
| శ్రీ పి. సుధాకరరావు | ,, |
| శ్రీ రామశాస్త్రి | ,, |
| శ్రీ సమ్మిరెడ్డి | ,, |
| శ్రీ పి. సత్యనారాయణరెడ్డి | హైద్రాబాద్ |
| శ్రీ సి. రాఘవాచారి | ,, |
| శ్రీ కె. సాయిరెడ్డి | ,, |
| శ్రీ జి. నరసింహరావు | ,, |

(ఏ పారితోషకమూ లేకుండా అడిగినదే తడవుగా/అడగకుండానూ రచనలు పంపించిన రచయితలకూ, తిలక్ స్మృతి సంచిక ప్రచురణలో ప్రముఖ సహకారాన్నందించిన శ్రీయుతులు గంగాధరరామరావు, 'బాపు', నిడమర్తి ఉమారాజేశ్వర రావు, (విశాలాంధ్ర ప్రచురణాలయం) వై. ఉపేందర్‌రావు గారలకు, సృజన–మలిసంచికలకు అక్షరమూ, ఆకారమూ ఇచ్చిన పి. సి. నరసింహారెడ్డి, 'శక్తి' కీ, పార్వతి ప్రింటింగ్ ప్రెస్, జడ్‌చర్ల కూ మా కృతజ్ఞతలు.)

ఫ్రీవెర్స్‌లో కథ:

# హృదయం దొరికింది

—శీలావీర్రాజు

నిశాదేవి నిద్రలో తొలగి వేలాడుతోన్న తెల్లని పట్టుపవిటలా వెన్నెల.
పసిపాప చూపులా తెల్లగా, ప్రియురాలి ప్రేమలా చల్లగా
మనసులో ఉల్లాసాన్ని ఉత్తేజాన్ని కురిపిస్తోన్న వెన్నెల.
ఆ వర్షం నీటిలో కోరికల కాగితపు పడవల్ని వదిలి
వాటివెనకనే చిన్న పిల్లల్లా మేం ముగ్గురం.
ఒకరు—వెన్నెల మడతల్లో చిక్కుకుని ఊపిరి సలపని రాజు.
మరొకరు—వెన్నెల పవిటను వింజామరంచేసి జ్ఞాపకాల్ని రాజేస్తున్న పాణి.
నేను—ఉల్లాసం జల్లులో తడిసి చలికి వణుకుతున్న వాడ్ని.
ముగ్గురమూ మరో అరవై మందితో అజంతా, ఎల్లోరాలకు బయలుదేరిన వాళ్ళం.
పిల్లలూ, వారికి కాపలాగా టీచర్లూ, వాళ్ళ మిత్రులూ, బంధువులూ అరవైమంది.
అజంతా, ఎల్లోరా కళా మండపాల్లో విహరిద్దామని
అక్కడి రాళ్ళలో నిద్రపోతోన్న హృదయాలను తట్టి లేపుదామని
ఓ చలికాలం పాతకాలం బస్సులో బయలుదేరాం.
పాణి ఆ స్కూల్లో ఉపాధ్యాయుడు. మాకు ఆప్తుడు.
అతని తరపున వచ్చిన వాళ్ళం నేనూ, రాజూ.
మా అజంతా యాత్రలో తొలిరాత్రి మజిలీ చిరాగ్‌పల్లి.
ఊరిచివర నిశ్శబ్దపు తోటలో ఒంటరిగా నిద్రపోతోన్న స్కూల్లో మాపడక.
ఆడాళ్ళు అవతలి వరండాలో, మగాళ్ళు యివతల.

బయట నరాల్ని పగ్గాల్లా పట్టి బిగించే చలి.
మా చుట్టూ విశాలంగా విస్తరించిన చలి చీకట్లమధ్య
ఒకవైపు దూరంగా వెన్నెల పవిటకు అంచులా నిద్రపోతోన్న ఊరు.

మరోవైపు తెల్లని గులాబీపువ్వులా ఆకాశంలో విరిసిన చంద్రుడు.
రాల్చిన పువ్వొడి కుప్పలా తెల్లగా మెరుస్తోన్న యిసుక పర్ర.

పట్టణంలో వెన్నెలకి మొహంవాచిన వాళ్ళం మేం ముగ్గురం.
నియోన్, మెర్క్యురీ లైట్లే మాకు వెన్నెల్ని ప్రసాదిస్తాయక్కడ.
అడుగడుగునా పోలీసు జవానుల్లా నుంచున్న ఎలక్ట్రిక్ దీపాలు
ఊళ్ళోకి ఏమాత్రం వెన్నెల ప్రవేశాన్ని సహించలేవు.
ఎక్కడైనా, నిద్రపోతోన్న జవానుదగ్గర జాలిగా కాస్తంత వెన్నెల వాలితే
చిరిగిన నేతచీరకు జరీగుడ్డ మాసికలా వుంటుందక్కడ.
వెనకెప్పుడో చిన్నప్పుడువెన్నెల్ని చిమ్ముకుని ఆడుకున్నాం.
మా నీడల్ని మేమే తరుముకొని పరుగులుతీశాం.
అప్పుడు వెన్నెల నిశాదేవి జార్చిన పవిటకాదు మాకు.
మా మీద దయగా మామామ చందమామ కురిపించిన వాత్సల్యపు వర్షం అది.
ఆ వర్షపు నీటిలోనే ఎప్పుడో బాల్యం కొట్టుకొని పోయింది.
యౌవ్వనం గాలులకు ఈ నగరపు ఒడ్డుపట్టి ఆగింది.
ఇక్కడ మాకు వెన్నెల అప్పుడప్పుడు సినిమాలో దొరుకుతుంది.
తెరమీదనే తప్ప ఒంటి మీద వాలదది.
అయినా ఆహా అని మురిసిపోవడం కద్దుమాకు.
నకిలీ అందాలకు అంగడినిండా అన్నీ సంబరాలే యిక్కడ.
అవే కొనుక్కుంటాం, అనుభవాల్లో నింపుకుంటాం.
ఇప్పటిక్కడ యింతకాలానికి అసలైన వెన్నెల!
(ఆ వెన్నెల్లో మళ్ళీ పసిపాపల్లా పరుగెత్తాలన్న కోరిక)
మఫ్లర్లూ, రగ్గులూ చుట్టుకొని వెన్నెల్లోనడుస్తూ మేం.

నిద్రపోతున్న కొండచిలువలాంటి తారురోడ్డుదాటి
విశాలమైన మైదానంలోకి మా నీడల్ని మేమే తోలుకొనిపోయి
ఓ చెట్టు మొదల్లో నీడల్ని కట్టేసి కూర్చున్నాం.
వెన్నెల పవిటలో వెలుగు నీడల అల్లికాన్ని చూస్తున్నాన్నేను.
దూరంగా వెన్నెలపవిట ఆవల కొండ శిఖరాల్ని వెతుకుతున్నాడు పాణి.
రాజు నిశ్శబ్దాన్ని రాగాలతో నింపుతున్నాడు.

పిళ్ళారిగీతాలూ, అష్టపదులూ పాడుతున్నాడు.
అసలే సంగీతం సన్నని నాజూకైన పూలతీగ.
అష్టపదుల్లో సంగీతం మరీ మృదువుగాసాగి చుట్టుకున్న వలపుతీగ.
హృదయంలోని మార్దవమే దానికి పందిరి.
ఆ పందిరి లేందే అది ఏపుగా విస్తరించి పెరుగదు.
రాజు మనసు ఉల్లిపొర కాగితంకన్న పల్చన,
అనుభవాల చిరుగాలులకు సైతం పులకరించేంత సన్నన.
అందుకే అతను సంగీతంతో మామీద పందిరి వేశాడు.
ఎన్నో చక్కటి సంగతులపూలు పూయించాడు.
మా చుట్టూ పరిమళాల వలయాలు తిప్పాడు.
మా మనసులు ఉల్లాసంతో ఊయలలూగి
మా కళ్ళలో కలల మత్తుతెరలు వాలి
మాకు తెలీకుండా కదిలిపోయింది కాలం.
మాదగ్గరే కట్టేసుకున్న నీడలు అల్లంత దూరానికి పారిపోతే
వాటిని విప్పుకొని తోలుకొస్తూబయలుదేరాం.
గుచ్చుకొంటున్న చలి ముళ్ళను దాటుకొంటూ
గబగబా ముందుకుపోతున్న రాజు.
పెళ్ళయిన కొత్తలో అనేకసార్లు భార్యపవిట కప్పుకొని
హాయిగా నిద్రపోయిన అనుభవం జ్ఞాపకాల్ని ఏరుకొంటూ వెనకబడిపోయిన పాణి.
ఈ వెన్నెల రాత్రి అనుభవాన్ని అక్షరాల్లో పొదిగి
చక్కటి ప్రేమ కథ చెక్కాలన్న ఆలోచనల మధ్య మెల్లగా నేను.

రాజుని కథా నాయకుడ్నిచేసి రాయాలన్న కథకు
మనసు కాగితం మీద రఫ్ స్కెచ్ గీస్తూ
ఏ అలంకార ఆభరణాలు తగిలించి
ఏ వర్ణనల బట్టలు తొడిగి
ఏ శైలి వాహనంమీద ఊరేగించాలా అని
ఆలోచనల్లోకి తొంగి చూస్తుండగా
అకస్మాత్తుగా రాజు పిలుపు.
పాదాలముందు పామేమోనని ఆతృతగా నేనూ

పాదాల్లో ముల్లేమోనని కంగారుగా పాణీ.
కాని—
రాజుముఖంలో భయం భృకుటిముడిలేదు, బాధల రేఖలులేవు
చిరునవ్వుల పూలదండవుంది, తెల్లటి కాంతివుంది.

మా ముఖాల్లో వేలాడుతోన్న ప్రశ్నల్ని తుడిచేస్తున్నట్టుగా రాజు—
"ఇదిగో! ఇక్కడెవరో హృదయాన్ని పారేసుకున్నారు రండి.
పచ్చగడ్డిలో హాయిగా పవ్వళిస్తోంది యిలాచూడండి.
ఎంత నాజూకుగా నిద్రపోతున్నదో మిత్రమా చూడు
ఏ సుందరాంగి పోగొట్టుకున్నదో దీన్ని పాపం
అయ్యో! మంచులో తడిసి, అంచుల వాడి
ముఖం వెలవెలపోయి గజగజా చలికి వణికిపోతున్నదే యిది
దీన్నిలా నిర్దయగా వదిలేయడం ధర్మం కాదు మనకు"
మెల్లగా వంగి తీసుకుని అరచేతిలో నిలుపుకుని
అరనిముషంసేపు కళ్ళల్లో దాని ప్రతిబింబాల్ని ప్రతిష్ఠించుకుని
మత్తుగా వాల్చిన కనురెప్పల వెనక దాచుకొని
ఆ చుట్టూ తిరుగుతున్న ఆలోచనల తుమ్మెదల్ని తోలుతూ కళ్ళు తెరచి—
"చెప్పండి, ఈ గులాబీ ఎవరి హృదయానికో సాక్షికాదూ.
నా పాట వినవచ్చిన ఏ కోమలాంగిరాకనో తెల్పడం లేదూ.
నిజం, ఏ అమ్మాయో యిటుగా వచ్చివుండాలి.
చలికి ముసుగు సరిచేసుకోవడంలో యిది జారివుండాలి!
—అన్న రాజు మాటల్లో ఎంత తీపి!
అతని ఆలోచనల్లో ఎంత ఆశ!!

కల్పన నిజంగా నిజంకన్న అందమైనది.
మనిషి సంపాదించుకున్న గొప్ప వరం అది.
చేదులాంటి నిజంచెప్పి రాజును గాయపరచడం దేనికి?
అతని సంతోషపు పొంగుమీద చన్నీళ్ళ చిలకరింపు ఎందుకు?
మీకు చెప్తాను కానీ రాజుకు చెప్పకండి
అబద్ధాన్నే అతన్ని గట్టిగా నమ్మనివ్వండి.

ఆ గులాబీ ఎవరి తలలోంచీ జారిపడలేదు.
అంతకుముందు వస్తున్నప్పుడు చలికి జేబుల్లో చేతులు దూర్చితే
చల్లగా మంచుముద్దలా తగిలి చలి చురక వేసిందని
నేనేతీసి బయట పారేశాను దాన్ని
గులాబీలు నాకు యిష్టమైన పూలు.
నామిత్రుల జ్ఞాపకాలకు అవి తీపి గుర్తులు.
నా పుట్టిన రోజున నాకు వచ్చేబహుమతులు అవే.
అవే నా హృదయాన్ని దాచుకునే పూల భరిణులు.
అసలు విషయంకాస్త చిత్తగించండి మీరు.
ఈ విహారయాత్రకు వచ్చేముందు బడితోటలో
కొంటెగా కన్నుగీటిన గులాబీ మెడలువంచి
రహస్యంగా కోసి దాచుకున్న పువ్వు అది.

ఈ చేదుమాత్రను మింగలేడు రాజు.
మింగినా అతను వాంతి చేసుకుంటాడు.
నిజం తెలుసుకున్నందువల్ల అతనికి ఒరిగేదీ లేదు.
తెలుసుకోక పోయినందువల్ల నష్టమూ లేదు.
అందుకే అతనికి నేను నిజం చెప్పలేదు.

"ఈ పువ్వు పోగొట్టుకున్నవాళ్ళు పరాయివాళ్ళు కారు.
మన బృందంలోని వారు వినా మరొకరు కానేకారు.
ఇక్కడికి అరమైలుపైన ఉంటుంది ఊరు.
మైదానమే తప్ప యిటువైపు పంటభూమి లేదు.
ఏ పల్లెపడుచుకూ యిటు వచ్చే పనికూడా వుండదు.
పైగా ఆమె బంతిపువ్వేగాని గులాబీ తురమదు.
ఈ పువ్వు నిజంగా నాపాట వినవచ్చినవాళ్ళదే అనాలి.
అష్టపదుల్ని వినవచ్చిన ఆ అమ్మాయిది అక్షరాలా రసహృదయమే కావాలి"
రాజు ధోరణికి ఆనకట్ట వేయలేదు నేను.
అతని ఆలోచనల ప్రవాహంలో కొట్టుకుపోతున్నాడు పాపం! పాణి.

మెల్లగా కదిలి స్కూలు చేరుకున్నాం.
అవతలి వరండాలో వెన్నెల్లో ఆడాళ్ళ
చలికి ముడుచుకొనిపోయిన మల్లెలు.
ఇవతలి వరండాలో వెన్నెల వాలని చీకట్లో మగాళ్ళ
కలల్ని తిని మత్తుగా నిద్రపోతున్న గొంగళీ పురుగులు.
పాపం! మాకై ఎవరో అక్కడ పక్కలు పరిచివుంచారు.
వాటిపైకి చేరగానే మా చుట్టూ నిద్రతెరలు.

ఎప్పుడో తెలివి వచ్చేసరికి నా పక్కనే నిద్రలేపుతున్న రాజు.
"అంతా లేచిపోయారు, యింకా ఏమిటా గాఢనిద్ర
కలల్లోంచి పిలుచుకొస్తే క్షమించుగానీ నీకో మంచివార్త
ఈ రాత్రి అబ్బ! ఎంత తియ్యని కలకంటినోయి మిత్రమా.
ఏ దేవత దయదలచిందో గాని మరపురానిది ఈ రాత్రి.
నా జీవితానికి ఈ రాత్రి కలల పంటచాలు.
సరే. ఆ బద్దకాన్ని దుప్పట్లో మడతపెట్టి బయలుదేరు.
అలా చెరువుపైపుపోతూ చెప్తాను కదులు"
—అంటూ భుజంపట్టి లేవదీసి, పక్కచుట్ట తనేచుట్టి
అతని ఉత్సాహపు ప్రవాహంలో పాణీసీ, నన్ను పూలికల్నిచేసి
రాత్రి వచ్చిన కలసాంతం మాముందు ఉంచాడు రాజు.

ఉహూఁ రాజు చెప్పిన కల మీకు చెప్పను.
అంత మంచి కథని పిట్ట కథ చేయను.
మరోసారి విడిగా ఓ ప్రేమ కథే చెప్తానులెండి.
అందాకా మీరు వేచి చూడండి; లేదా మర్చిపోండి.

కాల కృత్యాలు తీర్చుకొచ్చేసరికి భల్లున తూర్పు తెల్లవారింది.
అప్పటికి బస్సు బయలుదేరడానికి సిద్ధంగా ముస్తాబై వుంది.
బట్టల మీద రెపరెపలాడుతోన్న కొత్తరోజు చిగురుటెండలో
బస్సు బయట వెచ్చగా నుంచున్నారు మా వాళ్ళు.
పక్కచుట్ట తెద్దామని వరండా వైపుకదిలిన నా వెనకే
హడా విడిగా పరుగెత్తుకొచ్చాడు రాజు.

"ఇదో మిత్రమా! చూడు ఆ చివర మూడో అమ్మాయి
నాజూగ్గా బస్సుకు చేరబడి అటు తిరిగి మాట్లాడ్డంలేదూ
ఆమె వీపుమీద పాముల్లా వేలాడుతోన్న రెండు జడలుచూడు
అచ్చంగా అవి పడగెత్తిన నాగుబాములే కదూ
అదిగో ఆపడగమీద మాణిక్యంలా వడలిన ఓ గులాబీ
మరో పడగమీద ఏమీలేదు సరిగ్గా చూడు మరీ.
ఇప్పుడు తెలిసిందా రాత్రి ఆ అమ్మాయిదే హృదయం అక్కడ జారిపోయిందని
అందుకే ఆమె చూపులు చంచలమై కదులుతున్నాయి సుమీ''

రాజు కథలు రాయడుగానీ అతను కథకుడు.
అతనికి చక్కటి వర్ణనలుకూడా వొచ్చుమరి.
దారి పొడుగునా ఆ అమ్మాయి ఆకారంమీద అతని వ్యాఖ్యానాలు
అందుకు చక్కటి నిదర్శనాలు; అతని శక్తికి కొలబద్దలు
అతన్ని చూస్తే జాలికలుగుతోంది కదూ మీకు.
అవును; కలల్లో కల్పనల్లో తిరిగేవారు భూమ్మీద నడవలేరు.
నడిచినప్పుడు తూలిపడీ, జారిపడీ దెబ్బలు తగుల్చుకుంటారు
అందుకే నాకు నిజం చెప్పేయాలని వుంది.
కానీ యిప్పుడు చెప్పడానికి సమయం మించిపోయింది.
కలల్ని తినొద్దన్న ఆంక్ష ప్రపంచంలో ఎక్కడా లేదు.
కష్టపడి పనిచెయ్యమనే కమ్యూనిస్టు దేశాల్లోనే లేదు
మనది ప్రజాస్వామ్యం, పైగా యిక్కడ ఆకలి ఎక్కువ
కలల్నీ. కందమూలాల్నీ తినక తప్పదు.

పాణికి మాత్రం అసలు సంగతి చెప్పాను నేను.
ఆ అమ్మాయి వాళ్ళస్కూల్లో సైన్సుటీచరు రమాదేవి చెల్లెలట.
సరిగ్గా తెలీదుగానీ ఏదో కాలేజీలో చదువుతోందట.

మరో రాత్రి ఔరంగాబాదులో మజిలీ చేసి పొద్దున్నే ఎల్లోరాకు బయలుదేరి
నాలుగువైపులా కాంతి పరిమళాలను వెదజల్లుతూ
ఎల్లొరా రాళ్ళల్లో ఉదయం రేఖలు విచ్చుకొంటున్నవేళ—
తుమ్మెదల్లా ఎగురుతోన్న పిల్లగాలులు ప్రేమగీతాల్ని పాడుకొంటున్నవేళ—
మబ్బుల్లేని ఆకాశం ఉతికి ఆరేసిన బట్టలా మెరుస్తున్నవేళ—
మంచుతో కడిగిన రాళ్ళమీద సూర్యుడు రంగుల చిత్రాలు రచిస్తున్నవేళ
ఎల్లోరా కళా ప్రాంగణంలో అడుగుపెట్టాం.

'ఎన్ని నిరీక్షణల నీళ్ళుపోయగా చివరికి ఈ కోరిక పండిందినాకు
సంతోషంతో మనసు రెక్కలాడించి పక్షిలా ఎగిరిపోయింది.
ఉరకలు వేస్తున్న ఉత్సాహానికి దారులు వేస్తూ
బండరాళ్ళ పక్కగా కదిలి కైలాస దేవాలయంచేరి
ఆ రాళ్ళల్లో మేమూ రాళ్ళయిపోయాం.
మమ్మల్ని మేమే మర్చిపోయాం.
ఇంతగొప్ప అనుభవాన్ని భరించలేని హృదయం నాది.
అల్ప సంతోషిని. ఈ అనుభవ ప్రభంజనానికి తట్టుకోలేని వాణ్ని.
ఈ రాళ్ళకు ప్రాణాలు పోసిన శిల్పులు యిప్పుడు లేరు గాని వుంటే
నా హృదయాన్ని యిచ్చి 'మీ యిష్టం వచ్చినట్టు మలచుకోండి' అనేవాణ్ని
ఎక్కడో నా మనసు లోతుల్లోపలి పొరలో సన్నని రేఖలా
ఈ జీవితాన్ని యిక్కడే పారేదామన్న కోరిక.

రాయి తగిలితూలి ఆలోచనల్లోంచిజారి చూస్తే అక్కడ ఎవరూ లేం.
మా వాళ్ళ హడావుడి గుర్రాల రౌతులు, మందగమనం నచ్చనివాళ్ళు
ఆ మూలమాత్రం నాలాగే మరోలోకంలో నిలుచున్నాడు అంతర్ముఖుడు పాణి.
మరోమూల పుస్తకంలోంచి శిల్పాల్ని తిలకిస్తోన్నపాశ్చాత్యుడు
రాజు లేడు; పిలిచిన పిలుపుకి జవాబులేదు.
అతను విడిచిన ఊపిరికూడా ఎక్కడా ఎగరడం లేదు.

రాళ్ళలో రమణుల్ని పేరు పేరునా పిలిచి పరామర్శించి
ఒక్కొక్క గుహనే మెల్ల మెల్లగా చూసుకుంటూ
మా కూడా మోసుకొచ్చిన పళ్ళమాటే మర్చిపోయి
అనుభవాల్నే ఏరుకుని ఆకలిని తీర్చుకొని
పిచ్చివాళ్ళమై ఆ రాళ్ళలో తిరిగి తిరిగి
మళ్ళీమళ్ళీ మళ్ళీతిరిగి కాళ్ళరిగి
సూర్యుడు నిష్క్రమిస్తున్న వేళ రంగుల ఆకాశం క్రిందకూర్చుని
తాపీగా బత్తాయి పళ్ళు వొలుచుకొని తింటున్నప్పుడు
ఎక్కడి నించో గాలి కెరటం ఒకటి సన్నని రాగాన్ని మోసుకొచ్చింది.
ఆ రాగం ఎవరిదో మాకు తెలుసు. ఇప్పుడు మీకుకూడా తెలుసు.
అతన్ని వెతికి పట్టుకుని పాటలు పాడించుకుందామని
నిద్రపోతోన్న రాళ్ళను రాగాలతో తట్టి లేపుదామని
రాళ్ళను దాటుకొంటూ వెళ్ళబోతోన్న మాకు ఎదురుగ్గా
బాగా దూరంగా ఓ గుహలోంచి పాడుకొంటూ వస్తోన్న రాజు
అతని ప్రక్కనే నమ్మలేని నిజంలా రమాదేవి చెల్లెలు!



# నగరం

ఆంగ్లమూలం: షైలా చౌదరి

అనువాదం: ఇస్మాయిల్

"ఈ నగరానికి జబ్బు చేసింది" అన్నాడు విమర్శకుడు.

"అయితే కన్నీళ్ళేవీ? కన్పించవే?" అన్నాడు ఒకతను.

"ఇంతకీ కన్నీళ్లు వ్యక్తిపరిపక్వతలో భాగమా? యువతలో భాగమా?" అన్నాడు విమర్శకుడు— అప్పటికి పందోసారి ప్రకటనల 'కాలం' కి రాస్తున్న యువ పట్టభద్రుణ్ణి చూస్తూ.

తనని పోషించలేని కొడుకుని చీకటి గదిలో తిట్టుకుంటూ పళ్ళులేనిగొణుగుడేదో గొణిగాడు తండ్రి.

"అక్కడెవరో అవివేకి చచ్చిపోయింది. యువత అంతా అవివేకపు పనులు చేస్తుంది-ముసలివాళ్లని ఏడిపిస్తుంది." అన్నాడు ఒకతను—కొత్తగా కట్టిన భవనం మీంచి అమ్మాయి దూకిన స్థలాన్ని చూస్తూ.

"సినిక్ కంటే చచ్చిన అవివేకి నయం" అన్నాడు విమర్శకుడు—చచ్చిపోయిన అమ్మాయి సోదరి- యువగృహిణి- మొగం మీదున్న ముడతల్ని- వయసుపైబడిన వారికున్నట్టుండే ముడతల్ని-తుడుస్తూ,

ఆ అమ్మాయి తల్లి గుండెలు బద్దలయ్యేలా ఏడుస్తూ వుంటే- ఆ ఏడుపుని తగ్గించి ఆవిణ్ణి శాంతింప చేయడానికి యువగృహిణిని కూడా విషాదంగా కన్పించమన్నాడు విమర్శకుడు.

విసుగెత్తించే ఒకే పాట నగరంలో మెల్లగా ప్రతిధ్వనిస్తూ.

"ఏంలేని వాళ్ల అరుపు- బీద అరుపు" అన్నాడు విమర్శకుడు.

"అత్యాశతో అడుక్కుంటున్నారు వాళ్ళు" ఏదో నేరారోపణ చేస్తూన్నట్టు అన్నాడు ఒకతను— ధర్మం చేయమంటూ ఎవర్నో అడుగుతున్న యాచకుల్ని చూపిస్తూ.

"ఆకల్తో అడుక్కుంటుందావిడ." అన్నాడు విమర్శకుడు— ఆవిడ పిల్లాడి వుబ్బిన పొట్టని ముట్టుకుంటూ.

"పువ్వులున్న చోటైనా, పనికి రాని గడ్డి వున్న చోటైనా గాలి వీస్తూనే వుంటుంది. మార్పు తెస్తూనే వుంటుంది." చిరాగ్గా అన్నాడు ఎవరో ఒకతను.

"మంచితోట మాలి తన మొక్కల్ని జాగ్రత్తగా చూసుకుంటాడు, రక్షించుకుంటాడు." గంభీరంగా అన్నాడు విమర్శకుడు.

మనుషుల గుంపొకటి నిశ్శబ్దంగా మెల్లగా వీథిలో చేరింది. గుంపులోవున్న వాళ్ళ కళ్ళు లోతుకుపోయున్నాయి. వాళ్ళ మొగాల్లో విషాదం కాపురంచేస్తోంది. వాళ్ళ వెనక గతించిన పూర్వీకులు దహనమైనప్పటి పొగ మెల్లగా, మత్తుగా, చెల్లా చెదురుగా ఆకాశానికి లేస్తూంది.

"వాళ్ళెవరూ?" వాళ్ళు తనవైపు తేరిపారచూస్తుంటే అడిగాడు ఒకతను—భయంగా రెండడుగులు వెనక్కి వేసి.

"మిడాస్ రాజు తెలుసుగా—ఆ రాజు సంతానంవాళ్ళు" అన్నాడు విమర్శకుడు—స్వాతంత్ర్యం పేర ఒక గుంపు మెరస్తూ లేచిన స్థలాన్ని చూస్తూ.

అంతకు ముందొచ్చిన గుంపుకంటే పెద్దది-యింకోగుంపు వీధిలోకి వచ్చింది. బీదతనం తాండవిస్తున్న బట్టల్తో వున్నవాళ్ళూ, సరైన తిండిలేక కృశించిపోయిన వాళ్ళూ ఆ గుంపులో వున్నారు.

బల్లమీద క్రమంగా పెరిగిపోతున్న ఏవో అంకెల గారడీలను గంభీరంగా చేస్తున్న ఒక లావుపాటి మనిషిని చూస్తున్నారు వాళ్ళంతా.

వాళ్ళు మోయడానికి తయారవుతున్న కొత్త భారాన్ని గురించి యేం పట్టించుకోనట్లే భావరహితంగా చూస్తున్నారు వాళ్ళంతా.

అక్కడ వుపన్యాసం దంచుతున్న మనిషి వచ్చిన కారుని. అతనుండే భవనాన్నీ, అతను తినే ఖరీదయిన భోజనాన్నీ చూశారు వాళ్ళు.

వాళ్ళలో ద్వేషం రగుల్కొంది.

"వాళ్ళకి అర్థం కాదేమిది?" విచారం ధ్వనించే కంఠంతో అన్నాడు ఒకతను.

"ఆకలి ఎవర్నీ అర్థంచేసుకోనీదు" తీవ్రంగా అన్నాడు విమర్శకుడు.

ఆ గుంపులో ఒకతనికి ఏదో జబ్బు. ఆ జబ్బుని అతను తన సోదరులందరికీ పంచాడు. వున్నవాడూ లేనివాడూ అనే భేదం ఎంచకుండా వాళ్ళంతా ఆ జబ్బుని యింకెందరికో పంచారు.

ఆ జబ్బుని నయంచేసే మంచి పద్ధతి యేదో వచ్చింది.

కాని-వాళ్ళంతా దాన్ని కాదని-విగ్రహాల్ని తెచ్చుకొని వాళ్ళముందు నిలబెట్టుకున్నారు.

"ఆ పద్ధతిని వాళ్ళు నిరాకరించారు." అన్నాడు విమర్శకుడు-యువపట్టభద్రుణ్ణీ, పిల్లవాణ్ణీ, మరణించిన అమ్మాయినీ చూపిస్తూ.

ఎన్నో అగ్నిగుండాలనుంచి పొగలు ఆకాశానికి లేచాయి.

సాయం సంధ్య మసగ్గా అడుగుపెట్టింది.

కథ:

# మాతృ దేవోభవ

ఆర్. వసుంధర

అమ్మ చచ్చిపోతోందన్న టెలిగ్రాం చూచుకొని బయల్దేరి వచ్చాను. కాని తీరావచ్చాక, ఎందుకువచ్చానా అన్పించింది. ఎందుకు వచ్చానో అర్థంకాలేదు. వార్త వినగానే మనసులో ఏదో తెలియని అశాంతి, ఆవేదన రేగింది. ఏడుపు మాత్రంకాదు. ఆ అశాంతిలోనే, ఆలోచించకుండానే కాలేజికి సెలవుపెట్టేసి హైద్రాబాదునుండి బయల్దేరి వచ్చేశాను. అమ్మ చచ్చిపోతున్నదన్న మాట నిజమే, ఎన్నాళ్ళబట్టో చచ్చిపోతోంది. యిప్పుడు చావు మరీ దగ్గరకు వచ్చింది. రేపో ఎల్లుండో నిశ్చయంగా చచ్చిపోతుంది.

కమల దగ్గర్లోనే వుంది. పరిస్థితి విషమించిందని కబురు తెలియగానే కమలా, రంగా పిల్లల్తో వచ్చారు. వచ్చాక రంగ నాకు టెలిగ్రాం యిచ్చాడు. వెంటనే బయల్దేరి వచ్చాను. కాని తీరా వచ్చాక, యిప్పుడే రావటం అనవసరమనిపించింది. అమ్మకూ నాకూ మొదట్నుండీ సంబంధంలేదు. అమ్మకు కమల ఒక్కతే కూతురు, నాకు అమ్మ ఎప్పుడూ లేదు. మరి వెంటనే ఎందుకు బయల్దేరాను? లోకంకళ్ళు తుడవటానికి కర్మలప్పుడు వచ్చినా సరిపోయివుండేది, అనుకున్నాను.

అందరూ హడావుడిగా నిశ్శబ్దంగా తిరుగుతున్నారు. యింటికే చావుకళ వచ్చింది. అమ్మ మగతగా యీ లోకంలో లేకుండా కళ్ళు సగం తెరుచుకొని అర్థ శూన్యంగా చూస్తూ పడుకుని వుంది,

వచ్చినప్పటి నుండీ నాకు బోనులో పెట్టినట్లుగానే వుంది, ఏమీ తోచటం లేదు ఏమో తెలియని, ఒక్క చోట కుదురుగా వుండనివ్వని అశాంతి! సాయంత్రం అయ్యేసరికి యింట్లో వుండ బుద్ధి కాలేదు. మామిడి తోట చూసివస్తానని బయల్దేరాను. 'యిప్పుడెందుకూ?....' అన్నాడు రంగ మందలింపుగా, చిత్రంగా చూస్తూ.

'నాకేం తోచటం లేదు ... అప్పుడే ఎందుకు రమ్మన్నావ్ నన్ను?' అన్నాను.

'అత్తయ్య శారద ఏదీ? అనడిగింది. అందుకని....' అన్నాడు.

'ఓహో' అన్నాడు నిర్లక్ష్యంగా.

తోటకు వెళ్తుంటే నాలో మళ్లీ అశాంతి తలెత్తింది. అర్థంకాని అశాంతి! దోవలో చుక్కమ్మ కన్పించింది. ఏడుపు మొహంపెట్టి, 'అమ్మకెట్లుందయ్యా?' అన్నది.

'అట్లాగేవుంది' అన్నాను.

'ఎన్నాళ్ళు సెలవుపెట్టి వచ్చావ్?' అన్నది.

'వారం రోజులు' అనేసి నడకసాగించాను. చుక్కమ్మ ఎంతసేపయినా మాట్లాడగలదు.

వెనకనుంచే 'తోట దగ్గరికా? ఎందుకూ? ఏంచేస్తావ్?' అన్నది.

విననట్లుగా వచ్చేశాను. ఏం చేస్తాను? నేను పుట్టినప్పటినుండీ ఏమీ చెయ్యలేదు. చెయ్యటం చేతకాలేదు.

తోట నానుకునే స్మశానం వుంది. మా కుటుంబానికి ప్రత్యేకమయిన స్మశానం దానిపేరు 'పాపడి బొందలు'. ఎన్నో తరాల్నుంచీ మా పూర్వులందరూ అక్కడే దహనం చెయ్యబడ్డారు. నాన్నగారూ అక్కడికే పోయారు. రేపు అమ్మకూడా అక్కడికే పోతుంది.

అమ్మ వెళ్ళబోయే చోటును చూద్దామని రాలేదు నేను ఆ తోట దగ్గరికి. నాన్నగారు వెళ్ళిన చోటును చూద్దామని ఎప్పుడైనా వస్తుంటాను.

ఆ నిర్జన ప్రదేశంలో, ఆ కుప్పల మధ్యన, 'గంటలో కాలిపోయాడు. పుణ్యాత్ముడు' తోటలో అంటుమామిడి చెట్టుక్రింద కూర్చుని, బొందల్లోకి చూస్తూ, నాన్నగారికోసం వెతుకుతాను. మనసులో వ్యాహస్తంభించి పోయినప్పుడు నాన్నగారు వున్నట్లుగానే, కొరతలేకుండా, హాయిగావుంటుంది.

నాన్నగారు చచ్చిపోయినప్పుడు నేనులేను. అకస్మాత్తుగా పోయారు. నేను హైద్రాబాదునుండి వచ్చేసరికి దహనంకూడా అయిపోయారు. 'అంతబ్రతుకు బ్రతికిన పుణ్యాత్ముణ్ణి పాచిశవంగా రాత్రికి వుంచెయ్యకూడదు' అన్నారట మాయయ్య—రమల మామగారు.

సంగతి తెలియగానే నాకు గుండె పగిలి పోతుందేమోనన్పించింది. వారం రోజులు నిర్విరామంగా ఏడ్చాను. నాన్నను నాకు చూపించని అందరిమీద కసి పుట్టుకొచ్చింది.

పిచ్చెక్కిపోతుందేమో అనుకున్నాను. యిహ పిచ్చెక్కదనే నమ్మకం కలగటానికి మూడేళ్ళు పట్టింది. యీ మూడేళ్ళలోనూ మనస్థిమితంకోసం చాలా ప్రయత్నంచేశాను. సైకియాట్రిస్టును చూశాను. స్వాములవార్లను చూశాను. మామూలు డాక్టర్ల విషయం లెక్కేలేదు. ఎవరిని చూసినా ప్రయోజనం లేకపోయింది.

అందరివీ వట్టిమాటలు। ప్రాణంలేని, సంబంధంలేని, మెట్ట వేదాంతం. 'సంబంధం' లేని వాళ్ళు ఎట్లా సహాయం చెయ్యగలరు? చెయ్యగలరనుకోవటం భ్రమ అని తెలుసుకొన్నాను.

ఈ ప్రపంచంలో నాతో సంబంధం వున్న ఒక్క మనిషీ 'నాన్నగారు' ఎవరేమి చెప్పినా నా 'నాన్న' శవాన్ని నేను చూడకుండా ఎట్లా దహనం చెశారు? ఎవరికీ అట్లా చెయ్యడానికి హక్కులేదు, అమ్మకు తప్ప. నేను ముఖ్య వారసురాల్ని. పెళ్లయి పోయిన కమల లెక్కేమిటి?

అమ్మ నామీద కక్షతో కావాలని యిలా చేసిందేమో। అనిపించింది. కాని ఆమెకు నామీద కక్షకూడా లేదని జ్ఞాపకం వచ్చి చప్పబడ్డాను.

నేను గుర్తెరిగినప్పటి నుండీ ఆమెకు నాతో ఏ'సంబంధమూ' లేదు। ప్రేమ లేదు, ద్వేషం లేదు. ఆమె ముద్దుమురిపెమంతా కమలదగ్గరే. ఆమె తెలిసీ నాకేమైనా అన్యాయం చేసిందని నేను అనటం లేదు. నిజం చెప్పాలంటే న్యాయంగానే నిష్పక్షపాతంగానే వుండాలని ప్రయత్నించిందను కుంటాను. 'న్యాయం' ఎవరికాకావాలి, 'సంబంధం' లేక పోయాక?

ఆమె ఎప్పుడూ నాలో ప్రతిస్పర్ధనే రేకెత్తించింది. దానికి పూర్తిగా అహంభావ పూరితమైన ఆమె గుణమే కారణమో, నా బాధ్యతకూడ వున్నదో యిప్పటికీ చెప్పలేను. కారణమేదైనా ఫలితంమాత్రం ఆమెకూ నాకూ మధ్యన సంబంధం తప్పిపోవడం. చిన్నపిల్లగావున్నప్పనుండీ కూడ ఆమె ప్రేమాభిమానాలకోసం ఆత్మగౌరవాన్ని చంపుకొని పాటుపడలేదు నేను. ఒక రకంగా అమ్మ అహంభావమే నాకూ సంక్రమించిందేమో। కాని చిన్నపిల్లగా అమ్మ ఆదరంకోసం, మెప్పుకోసం పాటుపడకపోయినా, వాటికోసం ఎదురుచూడ్డం, ఆశించడం నాకు గుర్తే. అది నాకు లభించలేదు.

నా సుఖ దుఃఖాల్లో ఆమె ఎప్పుడూ పాలుపంచుకోలేదు. క్రిందపడి దెబ్బ తగిలించుకున్నాను. వెంటనే డాక్టరు దగ్గరకు పంపించి కట్టు కట్టించింది. నొప్పికి ఏడ్చినప్పుడు ' తగిలించుకున్నప్పుడు ఓర్చుకోవాలి మరి ' అన్నది. నొప్పితో సంబంధం పెట్టుకోకుండా, దూరంనుంచీ ... టైఫాయిడ్ జ్వరం వచ్చింది. జాగ్రత్తగా వేళకు మందు పోసింది. పాలూ జావా యిచ్చింది. ఏ నర్సుగాని అంతకంటే ఎక్కువ చెయ్యలేదు. కాని 'సానుభూతి' లేదు. తన విధ్యుక్త ధర్మాన్ని న్యాయంగా ఆచరిస్తుంది. క్లాసులో ఫస్టు మార్కులు తెచ్చుకున్నాను. 'ఒక్కసారి ఒస్తే చాలనుకోకు. ఎప్పుడూ రావాలి. బాగా చదువు' అని ఆజ్ఞాపించింది. ఏ విధంగానూ ఆమెను నేను 'స్పృశింప' లేక పోయాను. క్రమేణా ఆ ప్రయత్నం విరమించుకున్నాను.

నాన్న అట్లా కాదు. నా నొప్పితో నొప్పిపడ్డారు. నా మార్కులికి సంతోషించారు నాకు మార్కులు తక్కువైనా ఏమీ అనివుండరు! నాన్న దేవుడు. అమ్మ నాన్నగారిని సరిగా చూడదనీ, నాన్నంటే నిర్లక్ష్యమనీ అభిప్రాయం నాకు ఎందుకు ఎట్లా కలిదిందో తెలియదు. నిజం చెప్పాలంటే నేను అలా అనుకోవటానికి కారణం కూడా లేదు. కాని అనుకున్నాను. నాన్నను సంతోషపెట్టే భారం నామీద వేసుకున్నాను. కష్టపడి చదివాను. నాన్నగారికి కొడుకులు లేని లోపం తీర్చాలని నేనే కొడుకునై చదివాను. వుద్యోగంలో చేరాను. నాకు వుండే వుద్యోగావకాశాల గురించీ, అందులో పైకి పోగల అవకాశాల గురించీ, హైదరాబాద్‌లో గవర్నమెంటులోనుతో నేను కొనవలసిన యింటి గురించీ వూహాగానంచేసి, ఆశించి, సంతోషించాను. ఎందుకంటే నాన్నగారు నాతోసంతోషిస్తారు గనుక! పెళ్ళి విషయం తలపెట్టనే లేదు. నేను చేసుకోనని స్పష్టంగా చెప్పేశాను. నేను లేకుంటే నాన్నగారికి కొడుకెట్లా వుంటాడు? అందుకే యిప్పుడు ముప్పై మూడేళ్ళ కుమారి శారద, వైస్ ప్రిన్సిపాలెను.

కమలను మా మేనత్త కొడుకు రంగనాథాని కిచ్చి పెళ్లి చేశారు. ముగ్గురు పిల్లలు రంగ అమెరికాలో పి. హెచ్. డి. చేశాడు. తిరుపతి యూనివర్సిటీ కాలేజిలో ప్రొఫెసర్—యింత చిన్నవయస్సులోనే. నా కంటే ఏడాది చిన్న. నాన్నగారు మినహాగా యీ లోకంలో నిజంగా నా క్షేమం అభిలషించే వ్యక్తి రంగ ఒక్కడే ననుకుంటాను. మొదట్నుండీకూడా నాకూ రంగకీ మధ్యన అక్కా తమ్ముళ్ళ మధ్యన వుండే ఆంతరంగిక మైన సంబంధం, సానుభూతి ఏర్పడ్డాయి. అటువంటి రంగ కమల భర్త కావటం చాల సంతోషం కల్గించింది. కాని కమల రంగ విలువ తెలుసు

కోలేకపోతోందనీ, రంగకు అన్యాయం జరుగుతోందనీ అన్పిస్తుంది అప్పుడప్పుడు.

మామిడితోటనుంచి యింటికి వచ్చేసరికి చీకటిపడుతోంది. ఇంట్లోంచి ఏడుపులు వినరాలేదు. అమ్మ యింకా చచ్చిపోలేదన్నమాట.

'ఇంతసేపూ ఒంటరిగా ఆ తోటలో ఏం చేస్తున్నావ్?' అన్నది కమల.

'చీకట్లో పాములూ అవీ వుంటాయి' అన్నాడు రంగ చిరునవ్వుతో.

'పాములు నన్నేం చేస్తాయి!' అన్నాను.

కమల విసుక్కుంటూ పిల్లలకు అన్నంపెట్టటానికి వెళ్ళింది.

'పెళ్లి చేసుకోరాదూ' అన్నాడు రంగా.

అప్పుడప్పుడు యిదే సలహా యిస్తూవుంటాడు. నాకు నవ్వు వచ్చింది.

"తప్పకదూ. అమ్మ చచ్చిపోతుంటే యిదేనా ఆలోచించవలసినది? ఎవరైనా వింటే ఏమంటారు?" అన్నాను నవ్వుతూ. 'నీకుతెలసిన ఒక సుబ్బారావు హైదరాబాదులో సెక్రెటేరియట్ లో వున్నాడు. ఈ మధ్యన యిదే సలహా యిచ్చాడులే—తనను పెళ్లాడమని....' నవ్వేశాను.

రంగ నవ్వకుండా ఆలోచించాడు. 'ఎవరబ్బా' అన్నాడు. జ్ఞాపకంవచ్చాక 'వాడా? వాడికి పెళ్ళయిపోయింది. అరడజను మంది పిల్లలుకూడాను....కొంపతీసి వాడిని చేసుకోవాలనుకుంటున్నావేమిటి?..చాలా selfish fellow...' అన్నాడు ఆదుర్దాగా.

రంగ ఆదుర్దా చూసి నాకు మరీ నవ్వువచ్చింది. 'యిన్నేళ్ళు వచ్చాక పెళ్ళి కాని వాడు ఎక్కడ దొరుకుతాడు నాకు?....సుబ్బారావు నా సంపాదన ఆశించే చేసుకుంటా నంటున్నాడని నాకు తెలుసు' అన్నాను,

'శారదా, ప్లీజ్, వాకివిషయం ఆలోచించవద్దు....' అన్నాడు రంగ.

నిజానికి యింతవరకు పెళ్లిచేసుకోవాలనుకోలేదు. సుబ్బారావు మాటను పట్టించుకోలేదు,

'నేను నేనుగా నాసుఖంకోసం ఎప్పుడైనా ఒక్కపనైనా చేశానా? ....యిప్పుడు జీవితంలో settle అయ్యే అవకాశంవస్తే ఒద్దంటున్నావ్. నీవు selfish కాదా?' అన్నాను.

రంగ మాట్లాడలేదు. వెళ్ళిపోయాడు.

అమ్మ పడుకున్న వరండాలోంచి 'అమ్మాయ్, శారదా, కమలా....రండి, రండి' అంటూ అత్త తగ్గుస్వరంలో పిలుస్తూవుంది. వెళ్ళి చూశాను. అమ్మకు ఎగశ్వాస పుట్టింది. శూన్యంలోనికి చూస్తూ యాతన పడుతోంది, కమల ఏడుస్తోంది.

నాకు ఏడుపు రాలేదు. మళ్లీ లోపలికి వెళ్లాను.

అమ్మగురించి ఆలోచిస్తే మొదట నాకు జ్ఞాపకంవచ్చేది: నిజానికి నేను కమల కంటే రెండేళ్లే పెద్దయినా, నేను పెద్దదాన్ననీ, ఆమె సలహాల కతీతురాల్ననీ నా చిన్నప్పటినుండీ కూడ ఆమె అనుకోవటం. దానికి కారణమేమిటో నాకు తెలియదు. రెండో జ్ఞాపకం చిత్రమైనది. అది ఎందుకు నాలో అంతగా చోటుచేసుకుందా అని ఆశ్చర్యం కలుగుతుంది నాకే! అప్పుడు మా బడికి సెలవులు. అందరం భోజనాలు చేసి కూర్చున్నాం. మా యింట్లో పిల్లలు తమలపాకులు వేసుకునే అలవాటులేదు. ఎందుకో ఆరోజు వేసుకున్నాను నాలుక ఎర్రగా పండింది. అద్దంలో చూసుకున్నాను. మంచి నారింజ రంగులో పండింది. అమ్మ నా వైపు చూసింది, అయిష్టంగా. 'ఆ ఎర్ర పళ్ళతో శారద అచ్చు పల్లెటూరి అరవ మనిషి లాగా వుంది.... వొద్దంటే ఎందుకు ఆకులు వేసుకోవటం?' అన్నది. నాకు చాలా అవమాన మన్పించింది. అద్దంలో చూసుకున్నాను. నిజంగా నిత్యమూ ఆకులు నమిలే పల్లెటూరి అరవ మనిషిలాగా వున్నాను గారపళ్లతో! అమ్మ అన్నమాట కంటే ఆమెధోరణి నన్ను తీవ్రంగా గాయ పరచింది. అప్పటినుండీ మళ్ళీ తాంబూలం ముట్టుకోలేదు,

కాని యీ విషయం మాయని ముద్రగా నిలిచి పోయింది నాలో. నాన్నగారు ఒక మంచి పెళ్ళిసంబంధం గురించి నాతో చూచాయగా ప్రస్తావించినప్పుడూ మొదట నాకు జ్ఞాపకం వచ్చింది యీవిషయమే! వెంటనే పెళ్ళిచేసుకోనని చెప్పేశాను. నాన్న గారికి ఏ విషయమైనా చెప్పటం వరకూ తెలుసుగాని బలవంతం చెయ్యటం, తన అభిప్రాయం యితరులమీద రుద్దటం చేతకాదు. నేను అట్లా చెప్పాక ఎవరూ నన్ను పెళ్ళి చేసుకొనితీరాలని బలవంతం చేయ్యలేదు .... నాన్నగారు పోయాక నా జీవితం ఆలంబనం లేనిదై నిష్ఫలమైనదిగా అర్థరహితంగా కన్పిస్తోంది.

ఇప్పుడు అన్నీ జ్ఞాపకం చేసుకుంటే నాకో చిత్రమైన కోరిక కలిగింది— తాంబూలం వేసుకోవాలని! సీతయ్యను పిల్చి కొట్టుకు పోయి కిళ్లీ తెమ్మన్నాను. కిళ్లీ నములుతూవుంటే ఎంతో హాయనిపించింది........ కమలా వాళ్ల ఏడుపులు తగ్గ

స్థాయిలో విన్పిస్తూనే వున్నై.... ఇంతకాలం ఎందుకు నేను తాంబూలం వేసుకోలేక పోయాను?; ఏ సుఖం అనుభవించలేకపోయాను?; నేనుగా కోరి నాసుఖం కోసం ఏపనీ చెయ్యలేక పోయాను? అని ప్రశ్నించుకున్నాను. నన్ను ఏదో భూతం ఆవహించి నాచేత నాకోసం కాని పనులు చేయిస్తోంది! నన్ను పెళ్ళి చేసుకుంటాననే సుబ్బారావు జ్ఞాపకం వచ్చాడు. నలభైకి పైబడిన వయసు అయినా తెల్లగా అందంగా హుందాగా కన్పిస్తాడు. ఏం పెళ్లి చేసుకుంటే? అన్పించింది. 'శారదా ప్లీజ్, వాడివిషయం ఆలోచించొద్దు,....' అంటున్నాడు రంగ ... వెంటనే సుబ్బారావుకి వుత్తరం వ్రాయాలనిపించింది. యిప్పుడు వ్రాయకపోతే యిహ ఎప్పటికీ వ్రాయలేననీ అన్పించింది. వ్రాశాను.... పెళ్ళి చేసుకుంటానని....

నా డబ్బు వుద్యోగం చూసి చేసుకుంటున్నాడు సుబ్బారావు. అయితేనేం? ఆమాటకొస్తే డబ్బుమీద కోరిక లేనిదెవరికి? నాన్నగారు చచ్చిపోయిన తర్వాత ఆయన పేరుతో వుండే కొద్దిపాటి భూమి నాకే వస్తుందేమో నన్నప్పుడు కమల ముఖం చూసి తీరాలి! నాకు చాల నవ్వు వచ్చింది, 'దుంఖపడబోకు, యిద్దరం తీసుకుందాంలే సమానంగా' అన్నాను, రంగని జ్ఞాపకం చేసుకొని. కమల మొహం ముడుచుకొని, 'నీకేం సంసారమా, పిల్లలా? చక్కగా వుద్యోగం చేసుకుంటున్నావు చాలదా? నీకెందుకీ ఆస్తిపాస్తులు?' అన్నది. అమ్మకు ముద్దుల కూతురు గనుక అమ్మ పేరుతోవుండే రెండు లక్షల ఆస్తి తనకే వస్తుంది అని తెలుసు. యీ కొంచెం కూడా నాకు రాగూడదనే దురాశకు నాకు కోపం వచ్చింది. యింతలో అమ్మనాతో 'హైదరాబాదులో మంచి యిల్లుచూసి కొనుక్కోరాదూ?' అన్నది.

'అంత భాగ్యం లేదులే. నాకు అంత డబ్బు ఎక్కణ్ణుంచి వస్తుంది? మానాన్న పేదవాడు కదా' అన్నాను.

అమ్మను నొప్పిద్దామనే అన్నానేమో. ఆమె మాట్లాడకుండా వూరుకున్నది. మాట్లాడితే తనదేమైనా యివ్వవలసి వస్తుందేమోనని!

సుబ్బారావు పుత్తరం కవర్లోపెట్టాను. యింతలోగా రంగ వచ్చాడు.

'త్వరగా రా. అత్తయ్య చచ్చిపోతూవుంటే తీరిగ్గా కబుర్లు నముల్తూ వున్నావా? ఏం మనిషివి, లే ...' అన్నాడు కోపంగా.

నేను వెళ్ళేసరికి అమ్మను మంచం మీదనుండీ క్రింద పరిగడ్డి మీదకు మార్చారు. నోట్లో తులసినీళ్లు పోశారు. చెవిలో నారాయణ నామం చెప్పారు. అమ్మ ప్రాణవాయువు అనంతవాయువులో కలిసిపోయింది.

అందరి ఏడుపుల మధ్యా నాలో చెప్పలేని, ఏడుపుకాని, పెను తుఫాను. నా నోట్లొ తాంబూలం వుంది యింకా....

దహనక్రియ లయ్యాక అమ్మ వ్రాసిన విల్లు బయటికితీశారు. సగం ఆస్తి కమలకూ, సగంనాకు— హైదరాబాదులో మేడ కొనే నిమిత్తం— వ్రాసింది.

అది వినగానే నిశ్చేష్టనై పోయాను. నాలోని చైతన్యమంతా జారి పోయినట్లు నీరసం కలిగింది.

ఎందుకిట్లా వ్రాసింది? ఎందుకు? అనుకున్నాను. నాకేదో అన్యాయం జరిగి పోయినట్లు, నా ఆస్తినంతా ఎవరో దోచుకున్నట్లు బాధ కలిగింది. నా జీవచైతన్యమే స్తంభించి పోయింది. నిన్నటి తాంబూలం తాలూకు గార మాత్రం మిగిలింది పళ్ల మీద.

నీరసంగా సుబ్బారావుకు వ్రాసిన వుత్తరం చించి పారేశాను. గదిలో తలుపులు మూసుకొని కూర్చున్న నాలో అర్థంకాని మూగవేదన కట్టలుతెగి కన్నీరుగా ప్రవహించింది.

అమ్మ చచ్చి పోయింది!

...................................

...................................

జీవితం మళ్ళీ మొదలు!!



చర్చావేదిక:

# జీవితానుభవంలో హేతువాద దృష్టి

సురవరౌళిగారి వ్యాసం చదివాను. శీర్షిక మంచిదే. చర్చాప్రస్తుతం అవసరమే. ఆ వ్యాసం చదివాక యీ చర్చయొక్క ఆవశ్యకత యింకా ఎక్కువగా కొట్టొచ్చినట్టు తెలిసింది నాకు. సురవరౌళిగారు హేతువాది అని తనకుతానూ, సమకాలీన తెలుగు యువసాహితీపరులు తగినంత మందీ అనుకుంటారు. విచారం ఏమిటంటే ఆయన హేతువాది కానేకాదని ఆయన వ్యాసం తెలియబరుస్తున్నది.

తాను చెప్పుకున్నట్టు ఆయన నాస్తికుడు. నాస్తికుడు గనక హేతువాదిని అంటారు. నాస్తికుడు అయితే హేతువాదేననేది ఒక అపోహ. అలా అనటం ఒక అపవాదు. ఈ అపోహ, అపవాదు ఆంధ్రదేశంలో తగినంత వాడుకలో వున్నది. హేతువాదం నాస్తికత్వం ఒకటికాదు; ఒకదానికొకటి ఆశ్రయించి వుండేవీ కావు.

ఆయనకు నాస్తికత్వంలో విశ్వాసం ఉంది. అసలు నాస్తికత్వమే ఒక విశ్వాసం ఆస్తికత్వంలాగానే. హేతువాదిని కనుకనే నాస్తికుడనయాను అని అంటే కొంత వేరుగా వుండేది.

విశ్వాసం, నమ్మకం (faith) లేకపోవడమే హేతువాదం అని ఏ కొంచెం ఆలోచన కలవారికైనా అర్థం కావాలి. ఏదాన్ని గురించైనా విశ్వాసమూ నమ్మకమూ వుందీ అంటే హేతువాదంగా పరిశీలనకు ఆలోచనకు ఆ విశ్వాసము అవరోధము అయితీరుతూనే వుంటుంది. కాబట్టి హేతువాదానికి మొదట కావాల్సింది విశ్వాసం, నిశ్చితాభిప్రాయము (settled openion) లేకపోవడం. అందులోనూ ఆయనకు నాస్తికత్వం మీద వున్నట్లు Negative dogmatic openion, faith జీవితంలో హేతువాద పద్ధతికి సుతరామూ పనికిరానిది. ఆయనన్నారు, విశ్వాసం ఎంత బలంగా వుంటే అంత మంచిదని హేతువాదానికి విశ్వాసానికి పొత్తుకలిసాక యిక హేతువాదిగా ఎలా జీవిస్తాడో మానవుడు? విశ్వాసాలను విసర్జించ లేనివారు హేతువాదాన్ని సక్రమంగా అవగాహన జేసుకొనలేక వైరుధ్యాలవల్ల ఆంతరంగికంగా ఘర్షణపడుతూ

తమ్మి తాము బాధించుకుంటూ చుట్టూ సమాజాన్నీ అశాంతిమయం చేస్తారు. ఆయన చెప్పిన రెండు మూడు ఉదాహరణలూ యిదే రుజువు చేస్తున్నవి.

"హేతువాదం కలిగి వుండటానికి ప్రేమ జాలి మొదలైన తాత్కాలికోద్రేకాలు అడ్డు వస్తుంటాయి, వాటిని జయించాలి." అని వారంటారు. ప్రేమ, జాలి తాత్కాలిక మయిన వయినా, అవి వీడినవాడు హృదయాన్ని వదలినవాడే. ఇది హృదయాన్ని శిలగా జేసుకొనటమే. అలా శిలగా తయారయిన హృదయంవున్న మనిషి జీవన్మృతుడే తప్ప సజీవుడు గాడు. హేతువాదం మనిషిని సచేతనుడిగా చేస్తుంది. హేతువాదం తెలియని, విశ్వాసాలలో అంధఅభిప్రాయాల్లో కూరుకు పోయినవాళ్ళే చేతనత్వం సృజనాత్మకత కోల్పోయి ప్రేమ, జాలి హృదయస్పందన వీటి జీవన్మృతులవుతారు.

అందువల్లనే ఆయనది హేతువాదం కాదంటున్నా. నిత్యపరిశీలనకు, నిరంతర నూతనత్వానికీ దారిదీశేది, వర్తమానంలో జీవించడానికై విశ్వాసాలూ, స్థిరాభిప్రాయాలూ సంకెళ్ళని గుర్తింపజేసేదీ హేతువాదం. హృదయం, మనస్సూ ఎల్లవేళలా ముక్తంగా తెరచి వుంచినవిగా (Open mindedness) చేసేది హేతువాదం.

అలా కానిఎడల ఆయన మొదట్నే అన్నట్టు ఆస్తిక హేతువాదమూ, నాస్తిక హేదువానమూ మార్క్సిస్టు హేతువాదమూ వగైరా తయారయి హేతువాదం హేతు వాదంగా నిలవక ప్రతివారి విశ్వాసాలకూ వంత పలికేదిగా సమర్ధన కుపయోగించేదిగా అవుతుంది.

—అట్లూరి రంగారావు



## సమాధానం

నా వ్యాసంపై రంగారావుగారు రాసిన విమర్శచదివాను.

'నాస్తికత్వం' అనేది హేతువాదమేనన్న విషయం ఎలా ప్రచారంలో ఉన్నదో, నాస్తికత్వంకూడా ఆస్తికత్వంలాగానే ఒక నమ్మిక అన్నదికూడా అలాగే ప్రచారంలో ఉన్నది. ఈ రెండు ప్రచారాలలో ఏది అపవాదో ఏదికాదో తేల్చవలసింది నాస్తికుల ఆచరణమాత్రమే. 'తుహేవాదిని కనుకనే నాస్తికుడయాను' అని అంటే వేరుగా

ఉండేదన్నారు రంగారావుగారు. 'నాస్తికుడిని—కనుక హేతువాదిని' అంటే మరో అర్థం వస్తున్నట్టు వారికి స్ఫురించడానికి కారణం నేనా మాటను ఒకే మాటతో వదిలేసి వివరించక పోవడం కావచ్చు. 'హేతువాదం' ఒక మతంకానీ, నమ్మికగానీ కాదు. జ్ఞానం సంపాదించడంలో అదొక పద్ధతి. నిర్ధారణకు నిలిచిన దానినే సత్యంగా భావించడం.... అనుమానాది తదితర ప్రమాణాలకు ప్రాధాన్యత ఇవ్వకపోవడం ఇందులో ప్రధానాంశం. అసలు విశ్వసించకనే పోవడం కాదు, ఉదాహరణకు నిప్పు ఉంటే పొగరావడాన్ని మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం! దూరంగా పొగను చూచి అక్కడ నిప్పు ఉంటుంది అని అనుమాన ప్రమాణంద్వారా సాధించవచ్చు. హేతువాది అంతటితో ఆగక అక్కడికివెళ్ళి నిప్పు ఉందాలేదా? చూస్తాడు. ఉంటేనే విశ్వసించడం లేకపోతే లేదు....ఒక్కొక్కప్పుడు అక్కడికిపోవడం సాధ్యపడదు; ప్రత్యక్షప్రమాణానికి అవకాశంఉండదు. అప్పుడు హేతువాది అనుమాన ప్రమాణాన్ని నిర్ధారణకు పెడతాడు. నిర్ధారణ ( verification) కు నిలిచినప్పుడే, పొగవున్న చోటల్లా నిప్పుఉంటుంది అన్నదాన్ని విశ్వసిస్తాడు. (మోటారు నుండి, ఇంజను నుంచి పొగవస్తుంది. అక్కడ నిప్పుఉండదు. కనుక అనుమాన ప్రమాణం సిద్ధపరచిన "పొగ ఉన్నచోటల్లా నిప్పు ఉంటుంది" అన్నవాక్యం అసత్య మవుతుంది.)

ఆస్తికత్వం అంటే ఇదీ అని ఎలా స్పష్టంగా లేదో 'నాస్తికత్వం' అంటే ఇదీ అనికూడా స్పష్టంగా లేదన్నది ఇప్పుడున్న పరిస్థితి. ఈ పరిస్థితి ఇలా కావటానికి కారణం ఆయా సిద్ధాంతాలను ప్రచారం చేసినవారు అనుసరించిన కొన్ని అవకతవక పనులేనని నా అభిప్రాయం. 'నాస్తికత్వం' అంటే ఇదీ అని చెప్పడానికి సూత్రాల రూపంగా కొన్ని వాక్యాలు రూపొందించాలని ప్రయత్నించాం. ఆ ప్రయత్నంలో ఓ ఎనమిది సూత్రాలు చివరికి రచించి ప్రకటించాం. అందులో ఒకటి "జ్ఞానము సాపేక్షము" అనేది. పరమ సత్యముగానీ పరమ ( obsolute ) జ్ఞానముగానీ ఉండదని. ప్రపంచంలో ఏదీ పరమ ( obsolute ) మైనది కాదనేది నాస్తికవాదమే. ఈ వాదాన్ని మొదట మనదేశంలో ఆర్యనాగార్జునుడు ప్రతిపాదించాడు అప్పటి తర్కపండితులు ఆయన్ని గేలిచేశారు. ఏదీ పరమ సత్యముకాక, అంతా వ్యవహారిక సత్యమే అయితే 'ఏదీ పరమ సత్యం కాదు' అన్న నీ వాక్యం కూడా పరమసత్యం కాదు కదా—ఇక నీ వాదాన్ని ఎవరైనా ఎందుకు వినాలి? అని. 'మీవిమర్శ నా వాదాన్నే బలపరుస్తున్నది కాని, ఏమాత్రం ఖండించలేదని' నిబ్బరంగా సమాధానం చెప్పాడు ఆర్యనాగార్జునుడు. (ఈ విషయంలో పరిశోధన జరిపి శ్రీ జి. వి. కృష్ణారావుగారు ఓ పుస్తకం ప్రచురించారు.)

హేతువాదాన్ని కాదనేది నాస్తికత్వము కాదు; హేతువాది కానివాడు నాస్తికుడు కాలేడు. హేతువాదులంతా నాస్తికులు అయి తీరుతారని నా అభిప్రాయంకాదని.... కాని నాస్తికులంతా హేతువాదులై తీరాలన్నది నా నిశ్చితాభిప్రాయమని స్పష్టం చేయదలిచాను మూఢంగా నమ్మేవాడు, నాస్తికత్వంపేరుతో కొన్ని కొత్తపీఠాలను కొత్తమతాలను కొత్తరకం మూఢాచారాలను స్థాపించగోరేవాడు నాస్తికుడెలా అవుతాడు? అయితే ఆంధ్ర దేశంలో ఇటీవల కొందరు తాము నాస్తికులమని చెప్పి 'పైన' పేర్కొన్న అవకతవక పనులన్నీ చేసి ఇప్పుడు 'సర్వోదయం' తెరవెనుక్కు తప్పుకున్నారు. వాళ్ళ ధోరణులు రంగారావుగారి వంటి వాళ్ళకు ఇంకా అనేకులకు 'నాస్తికత్వం' కూడా ఒక నమ్మకమేనన్న అపోహను కలిగించి వుండవచ్చు. వాళ్ళు నాస్తికులు కారు; హేతువాదులు అంతకన్నా కారు.

'నాస్తికుణ్ని కనుక హేతువాదిని' అని నేనన్నమాటను రంగారావుగారు అర్థం చేసుకోవడానికి పై వివరణ చాలనుకుంటాను. వారన్నట్లు 'హేతువాదిని కనుకనే నాస్తికుడినయాను' అని సవరించుకోవడానికి నాకు అభ్యంతరంలేదు. హేతువాది అయినవాడు మాత్రమే నాస్తికుడు కాగలడు. నాస్తికుడు అయ్యాక అతడు నాస్తికుడు కావడానికి ప్రాథమిక అర్హతగావున్న హేతువాదం ఎలా మటుమాయం అవుతుంది?

నేను వ్యాసం చివరి వాక్యంలో "విశ్వాసం ఎంత బలంగావుంటే" అని రాసిన వాక్యాల్ని తీసుకొని రంగారావుగారు నన్ను 'హేతువాది కానేకాడు' అని తీర్పుచెప్పేశారు. ఈ వాక్యంలో నేను 'విశ్వాసం' అన్నమాటను 'Faith' అన్నమాటకు గాక, 'Conviction' అన్న మాటకు మారుగా రాశాను. (తెలుగుశబ్దాలు స్పష్టతను కోల్పోయాయా?)

రంగారావుగారు హేతువాదాన్ని నిర్వచించడానికి చేసిన ప్రయత్నం అభినందనీయం. చాలా చక్కగా నిర్వచించారు. హేతువాదం అంటే ఏమిటో వారుచేసిన వివరణతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. అయితే ఇంకాకొంచెం స్పష్టీకరణ అవసరం.

అభిప్రాయం ఏదీ స్థిరపడి శాశ్వతం కాకూడదు Open mindedness ప్రధానంగా కావలసిందే. కాని పరిమిత సమయంలో ఒక స్థిరమైన విశ్వాసం (Conviction) కలిగి ఉండటంకూడా అవసరమే. సరైన హేతువాదంవల్ల ఆ Particular Conviction మార్చుకునేదాకా దాన్ని బలంగా విశ్వసించడం అవసరం. రేపెప్పుడో

నాకున్న ఈనాటి విశ్వాసం సడలవచ్చు కనుక ఇప్పటి నుంచే మరే హేతువు (ముందెప్పుడో మారవచ్చునేమో నన్న సందేహం తప్ప) లేకుండా విశ్వాసాన్ని (Conviction) సడలించుకోవడంవల్ల నిష్క్రియ పెరుగుతుందేమో రంగారావుగారు ఆలోచించవలసిందిగా కోరుతున్నాను. జీవితంలోని ఏ క్షణంలోకూడా స్థిరమైన విశ్వాసం లేకపోతే గోపీచంద్‌గారి నవల 'అసమర్థుని జీవయాత్ర' లోని సీతారామరావు బ్రతుకు అయిపోతుందేమో పరిశీలించవలసిందిగా రంగారావుగారిని కోరుతున్నాను. ఇప్పుడీ వ్యాసం రాయడానికి పూనుకున్న నాకు వ్యాసం ముగిసేదాకానన్నా వ్యాసాన్ని పూర్తి చెయ్యాలి అన్న లక్ష్యం లేకపోతే బ్రతుకంతా అయోమయం అరాచకం అయిపోదూ?

ప్రేమ జాలి మొదలైన తాత్కాలికోద్రేకాల్ని రూపు మాపుకోవాలని నేను అనలేదు. జీవితంలో హేతువాద దృష్టిని ఆచరించడానికి అడ్డువచ్చినప్పుడు వాటిని జయించాలని మాత్రమే అన్నాను. శిశువుకు జ్వరంవస్తే ఇంజక్షను ఇవ్వడానికి వచ్చిన డాక్టరు లేత శరీరంలో సూది గ్రుచ్చడానికి 'జాలి' తో వెనకాడ్డం హేతువాద దృష్టికి ఆటంకం కాదూ? అంతేకాని ప్రేమ, జాలిని పీకేసుకొని హృదయాలను శిలలను చేసుకోవాలని నేనెప్పుడూ కోరను. నా వ్యాసంలో వినోబాను కోట్ చేసినప్పుడు ఈ విషయం స్పష్టంచేశానుకూడా "............సత్యాన్వేషణకు అడ్డురాక దాన్ని ఆచ్ఛాదితం చెయ్యకుండా సత్యాన్వేషణకు దోహదం చెయ్యగలదే సమగ్రమైన ప్రేమ.................. సత్యము-ప్రేమ పరస్పరాశ్రితాలై, పరస్పర పోషకాలు కావాలి. అలా అయితేనే అది సమగ్రప్రేమ-అది నిజమైన సత్యాన్వేషణ" అని రాశాను.

నేనిచ్చిన రెండు మూడు ఉదాహరణలు నా అనుభవంలోనుంచి ఇచ్చినవే. ఇప్పుడు నా వయస్సు 33 సంవత్సరాలు. గత పదిహేనేళ్ళుగా నేను గడపిన జీవితం హేతువాద దృష్టితోనే గడిపానని నేను అనుకుంటున్నాను. నేను పేర్కొన్న ఉదాహరణలలోగాని, నేను నా జీవితంలో ప్రవర్తించిన మరే ప్రవర్తనలోగాని హేతువాద దృష్టికి భిన్నమైన ప్రవర్తన ఉన్నట్టు రంగారావుగారు చూపించినట్లయితే దిద్దుకోవడానికి నేను సదా సంసిద్ధుణ్ని. రంగారావుగారు హనుమకొండవాసులు. నేను గత నాలుగు సంవత్సరాలుగా వరంగలులో ఉంటున్నాను. నా నిత్య జీవితాన్ని, నిత్య జీవితంలో నా ప్రవర్తనను పరిశీలించవలసిందిగా రంగారావుగారిని ఆహ్వానిస్తున్నాను. "జీవితాను భవంలో హేతువాద దృష్టి" అనే చర్చ కేవలం సిద్ధాంత చర్చకే పరిమితం కారాదని, జీవితానుభవాలు, మన ఆచరణ ఇది ఈ చర్చలో ప్రాధాన్యతవహించాలనీ నేను ఆకాంక్షిస్తున్నాను.

— సురమౌళి

# థాంక్యూ! బేబీ! థాంక్యూ.

ఆరుద్ర

అవునమ్మా! అవును!
అలాగే అందరం నేర్చుకున్నాం భాష
నీ నాలుకపై నాట్యం చేసే స్వరాలు
నీ చిన్నారి పెదవులు గులాబీరంగుల ఇంద్రధనుస్సుల్లా
ఒంపులు తిరిగినప్పుడు ఒలికే శబ్దాలు
నీ మూసిన పెదవుల పెట్టెల్లోదాచిన రత్నవీణలు
తానం పలుకడానికి చేసే ప్రయత్నాలు
నీ సంతృప్తి గుటక సంతోషధ్వనులు
నీ సగర్వ మందహాసాల్లో నాదలేశాలు
నిగమాలకన్నా నిగూఢమైనవి
అర్థమవని నీ మాటలు రైల్లో రాబోయే ప్లాట్ ఫారాలు
వింతధ్వని చేసేనీగొంతుక ఓపెన్ కాబోయే రేడియో స్టేషన్
మాట్లాడు మాట్లాడు బేబీ! మాట్లాడు
తెలియరాని నీ మాటల ద్వారా
తెలుగు భాష పుట్టుక తెలుసుకొంటాను
అచ్చులూ హల్లులూ నీ కంఠంలో చేస్తున్న
అపూర్వమైన మహాసభని తిలకిస్తాను
నీ ముద్దు మాటల అద్దంలో నాచిన్నప్పటి ముఖం చూసుకొంటాను
నీ ఊసుల పూసలకి భావాల దారాలు లేవుగాని
నీ చక్కని పదాల ముక్కలు నా గుండెలకి రెక్కలిస్తాయి
పరులు వీక్షించనప్పుడు నువ్వు పలికేసుడులు
బాణుడు ఎంగిలి చేయని పిండివంటలు
పదాలకు తగ్గట్టు నువ్వు తిప్పుకునే చేతి ఊపులు
బాలసరస్వతికి అభినయం నేర్పే ముద్రలు
ఎడతెగకుండా నువ్వు పొడిగించే మాటల కాంబినేషన్లు
ఏ విశ్వనాథసత్యనారాయణా కట్టలేని సమాసాలు
దేవునికన్నా గడుసుదానివి నువ్వు

మా వాక్యాలు అర్థం చేసుకుంటావుగాని
నీ ఉద్దేశాలు అర్థం కానివ్వవు
దేవతలకన్నా మంచి దానివి నువ్వు
ఏ విహాయస పథాలలోనో విలీనమై పోతాయి వాళ్ళగానాలు
నీ వినిర్మల స్వరాల సింఫొనీ గుండెల్లో
టేపు రికార్డు చేసుకోనిస్తున్నావు
మళ్ళీవినే అవకాశం మనస్సులో కలకాలం నిలుపుకోనిస్తున్నావు

థాంక్యూ బేబీ! థాంక్యూ!



# చచ్చి బ్రతుకు!

—సి. యస్. సి. మురళి

అందరూ నడిచే అడ్డదారి నుంచి
ఏం మునిగిపోయిందని విడిపడ్డావ్?
ఒంటరితనం భరించలేనని ఆక్రోశిస్తూ
ఏం అలా వెఱ్ఱిగా చూస్తూ నిలబడ్డావ్?
బల్ల క్రింద నుంచి కాగితాలు ప్రవహిస్తే
బల్ల మీద కాగితాలు కదుల్తాయని తెలిసీ
ఒల్లనని బిఱ్ఱ బిగిసిన నీవు చిన్న కుర్చీకి
అంటుక పోయానని దేముడి దగ్గర ఏడుస్తావేం?
నీ మడి బట్టలూ నుష్యూ నవ్వుల్లో దేకుతుంటే
కన్నీళ్ళెట్టుకుని విలవిల్లాడుతున్నావేం?
హృదయాన్ని నిర్జించి ఆత్మను త్యజించి
నీ ముందు పోతున్న అన్నయ్యల అడుగుల్లో నడు
బ్రతికుండగా నువ్వు జీవించలేవు కనక
చచ్చిపోనువ్వు; చచ్చి బ్రతుకు
చేవవున్న మగాడివైతే నాతోరా
చిరిగిన బట్ట చూసుకు సిగ్గుపడకు మరి!



# కీర్తిశేషునికి ఉత్తరం

సోదుం రామమోహన్

నిజం నేస్తం నిజం
దేవుడు కరుణించి నీవు మరణించావు
మా కష్టాలు నష్టాలు మానావమానాలు
భయాలు భ్రాంతులు తిట్లూ పాట్లూ రాట్లూ
ఏవీ అంటని నీవు నిజంగా అదృష్ట వంతుడవు
నీవు వెళ్ళినప్పట్నించీ లోకం పెద్దగా మారలేదు
పార్లమెంటులో వాకౌట్‌లూ ఫ్యాక్టరీలలో లాకౌట్‌లూ
మామూలుగానే వున్నై
నాగరికతా నడి రోడ్డు మీద మొద్దులా
ఇంకా నిలబడే వుందిఎద్దు.
కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని మరణశయ్య మీదున్న కళత్రాన్ని
నిర్దాక్షిణ్యంగా వదలి
నేను రోజూ
ఆఫీసుకు హాజరవుతునే వున్నాను
ఆకాశాన్నంటే రాకాసి ధరలతో వేగలేక
జీతాలు హెచ్చించమని దీనంగా అర్థించే యన్జీవోలను
లాకప్పులతో లాఠీలతో భయపెడుతున్నారు పాపం
నీవు వున్నప్పుడు గద్దె ఎక్కిన అవినీతి యింకా దిగలేదు
రాబందుల రాజ్యం యిప్పుడు మమ్మల్ని శవాలజేసి పొడుస్తున్నది
రాత్రిళ్ళు మేమింకా శాంతిగా నిద్రపోవటం నేర్చుకోలేదు
నేస్తం! మాయిళ్ళ చుట్టూ గొప్పగొప్ప సందేహ వృక్షాలు
మా హృదయాల లోపల భారీ భయత్ భూతాలు.
మా శ్వాసల్లో విషార్చులు
మా జాతకాల్లో శనిరాసులు
ఇదీ మాస్థితి ఇదీ మాగతి
సామ్రాజ్య వాంఛకూ, స్వాతంత్ర్యకాంక్షకూ
ఈర్ష్య రక్కసికీ ప్రేమ దేవతకూ

కుబేరునికీ కుచేలునికీ
ఇంకా సంఘర్షణ సాగుతోంది;
అన్నం లేనోళ్ళింకా అలమటిస్తూనేవున్నారు
పుణ్యంచేయనోళ్ళుయింకా సుఖిస్తూనే వున్నారు

ఇక వుంటామరి నేస్తం
ఇలాగే రాస్తూ కూచుని
పొద్దున్నే "కల్పలత"కు పోలేక పోతే
చావంగాని తప్పదు వస్తు.



# చీకట్లో....

పుష్యమిత్ర

అమావాస్య తమోరాసి
జడివానగ కురుస్తోంది
పథ మెరుగని బాటసారి
కన్ను వెలుగు పరుస్తోంది

తెరవెరుగక తెరపిలేక
తీతువదే అరుస్తోంది
రక్తతృష్ణ తీరని, వో
దోమ పట్టి కరుస్తోంది

జీవ జలం ఇంకిన ఈ
దీప కళిక వెట్టి మొహం
గుండె బలం తగ్గినపుడు
బాధ కాల్చు నహరహం

తెర వెరుగని తీతువుకా
తెరపిలేని అరపెందుకు?
'గడియ తీరికైన లేని
కాలానికి పరుగెందుకు?

వెతల చలులు ఎముకల
నమిలి మ్రింగ జూస్తుంటే
వెలుగు చూప తమోరాసి
కాలకీల కాల్చేందుకు॥

అమావాస్య తమోరాసి
దోమ నన్ను కరుస్తోంది।
దోమకాటు బాధలోన
గుండె తనను మరుస్తోంది।

★

# నూతిలో శవం

తంగిరాల

ఉన్నట్టుండి ఊరి బయట నూతిలో శవం తేలింది
కలియుగ వైకుంఠంలో
కోట్లకొలది యాత్రికులు కొలిచే కొండప్రక్కన
నూతిలో శవం తేలింది.
ఈ 'పవిత్ర' భారత దేశంలో నూతిలో తేలేవి స్త్రీ శవాలే.
చల్లని కుళ్ళు నీళ్ళలో వెల్లకిలా పడివుంది శవం!
కర్రలా బిగిసింది!
టెర్లిన్ చీర కట్టుకుంది! జాకెట్లో పర్సు పెట్టుకొంది!
నేను ముఖాన్ని పర్జిస్తానేమో అని
మెత్తగా చితగ్గొట్టాడు హంత!
చంద్ర బింబంలా ఉండవలసిన ముఖం
జాతరలో తెగవేసిన గొర్రెపోతు మెడలా ఉంది....
కప్పలూ చేపలూ కూడి వక్షోజం కొరికేశాయి....!!

ఎవరీమె ...?
పట్నంలో వినోదం చూద్దామని వచ్చిన పల్లెటూరిపిల్లేమో....
పట్నంలోనే కాపురమున్న....ఫ్యాషన్ కత్తేమో....
భర్త మోసగించిన భార్యామణియేమో....
విసిగి వేసారిన వ్యాధిగ్రస్త ఏమో....
అత్తగారి బాధలు పడలేని కోడలేమో....
ఎవరైనా కావచ్చు ఈ పవిత్ర భారత దేశంలో!
నిన్నలేదు, మొన్నలేదు నూతిలో
తెల్లవారి హఠాత్తుగా తేలింది శవం!
ఊరంతా గుప్పుమంది....
నూతిలో ముసలి కప్ప హుషారుగా గంతువేసింది!

చీకటి కామం రంగరించి పూసుకుంది రాత్రి
రాత్రి సంఘం వీపుమీద రాచపుండు పగిలింది.

★

వరవరరావు

# రెండు అసంపూర్తి / అసంతృప్తి గీతాలు

## 1

కొత్త నీరు వస్తుందనుకోడానికి వానలేదు
కొత్త నోరు అరుస్తుందనుకోడానికి ప్రాణ లేదు
నాలో నాగురించి దాగిన నిజాన్ని
ఏదో ఇజం కప్పుతున్నది.
ఎప్పుడూ ఏవో పాత వాసనలు
చప్పుడూ చడి చేయకుండా వచ్చే ఛాయలు
అంతః కరణ ఏదో అనుకరుణ ఏదో
అసలు చూస్తున్న రంగు నిజమో
కన్నుల పై తెరకట్టింది ఏ రజమో
ఎక్కడికి వెళ్ళాలనుకొని
ఎక్కడికి చేరుకుంటున్నానో
కలల్లోని అస్పష్టతలు
జీవితానికి ఎంతవరకు ప్రతిబింబాలో
ఏది చెప్పాలనుకున్నా గొంతు పెగలదు
ఎదలో పేరుకున్న స్తబ్ధత పగలదు.

ఎక్కడా అశ్రువులు లేకుండా తుడిచి
ఎక్కడా పల్లాలు లేకుండా పూడ్చి
అంతటా అరమరలు లేకుండా భయంవిడిచి
అరలు విడిచి, ఆధోలోకాలు గడిచి
అచ్చమయిన వెలుగులోకి నడచి........

**2**

ఎన్నడింక నన్ను నేను చీల్చుకోని వస్తాను
వెలుగులోకి వస్తాను
లోవెలుగులు తెస్తాను.
మతం నుంచి, మమత తుంచి
గతం తెంచి, ఘనత నుంచి
మగత నుంచి.
ఇజం విడిచి ప్రిజన్ గడిచి
రజం తుడిచి ధ్వజం మడచి
నిజం లోకి
విశాలమయిన visionలోకి....
ఈ దేశం, ఆ–దేశం
నా దేశం
ఆదేశం, ఆక్రోశం ఏదీ లేని
ఒకే ఒక్క సందేశం
ప్రతి ఒక్కని సంతోషం
ఒకే ఒక్క ఆకాశం
ప్రతి ఒక్కని కవకాశం ఎన్నడింక....

ఎన్నడింక ధనం కన్న విలువయిన
జనం పుట్టుకొస్తారు
పదవికన్న విలువయిన
పదం పుట్టు కొస్తుంది.

అబద్ధాల అద్దాలు
ప్రలోభాల పరదాలు
ఇచ్చకాల వినోదాలు
మెచ్చుకోలు సరదాలు
నోరుపుచ్చు జరదాలు
కీర్తి దురద ఆస్తి బురద
నాగరికతారణ్యంలో
నలు వైపుల మృగాల రొద........

* *

# ఆధునికాంధ్ర కవిత్వతత్త్వం—ఒక పరిశీలన

రెంటాల గోపాలకృష్ణ

పూర్వరంగం: చెడుకూడా ఒక్కొక్కప్పుడు మంచికే వస్తుందంటారు. ఇంగ్లీషు వాళ్ళు మనదేశానికి రావడం మన దేశాన్ని పాలించడం ఒక విధంగాచూస్తే మంచికే వచ్చిందనిపిస్తుంది. ఎందుచేతనంటే, మనం అనేక విధాలుగా బానిసలమై ఉన్నామన్న సంగతి మనం గుర్తించుకోగలిగాం. పారిశ్రామిక నాగరికతనూ, ప్రపంచ సంస్కృతినీ అవగాహన చేసికోడానికి అవకాశాలు ఏర్పడ్డాయి. ప్రజాస్వామ్యం, స్త్రీ స్వాతంత్ర్యం, సాంఘిక మూఢ విశ్వాసాలపై తిరుగుబాటు, విశ్వసాహిత్య ధోరణులు— మున్నగు ఎన్నో క్రొత్త విషయాలు మనం కనుగొన్నాం. పరపీడన పోవాలన్నాం. దేశ స్వాతంత్ర్యం కావాలన్నాం. షా, మాటర్‌లింక్, టాల్‌స్టాయ్, గోర్కీ, రోమన్‌రోలా, ఈట్స్, ఇలియట్, జేమ్స్ జాయిస్, ఛార్లెస్ బోయలర్, ఆడెన్, బాడ్‌లేయర్, పాబ్లో నెరుడా, మయకొవా స్కీ - ఇలా ఎందరెందరివో నీడలువచ్చి మన సాహిత్యంమీద వ్రాలాయి. ముఖ్యంగా సోషలిజం, కారల్‌మార్క్స్, ఏంగెల్స్, రష్యాకమ్యూనిస్టు ఉద్యమం—

వివేకానందుడు మతంలో మార్పుతెచ్చాడు. రాజారాంమోహనరాయ్ సాంఘిక విప్లవానికి శ్రీకారం చుట్టాడు. సహగమన నిర్మూలనం, వితంతువు పునర్వివాహం, స్త్రీ స్వేచ్ఛ, బ్రహ్మసమాజం,— ఇలా ఎన్నెన్నో పరిణామాలు. గాంధీ మహాత్ముడు పరిపాలనను ప్రతిఘటించాడు. జగత్కవీంద్రుడు రవీంద్రుడు విశ్వమానవ మహాపురుషుని వేదనను గానంచేశాడు. అరవిందుడు ఉన్నత మానవాత్మను అన్వేషించాడు. మరి, ఈ ఉద్యమాలన్నిటిని అధఃకరిస్తూ మార్క్సిస్టు భావోద్యమం మేలుకొన్నది. భారత జాతిలో ఎక్కడచూచినా చైతన్యం వెల్లివిరిసింది.

మరి, ఈ మహావాహినిలో తెలుగుదేశంకూడా స్నానంచేసింది. వీరేశలింగం, చిలకమర్తి, ఉన్నవ లక్ష్మీనారాయణ, గురజాడ మహాకవి——. సంఘాన్ని మేలుకొలిపారు.

అసలు, ఇరవయవ శతాబ్దం భారత చరిత్రలోనేకాక, ప్రపంచ చరిత్రలోనే విప్లవాత్మకమైనది. మానవ చరిత్రలో మున్నెన్నడూ కని—విని ఎరుగని మహత్తర పరిణామాలు ఎన్నో ఈ శతాబ్దంలో తలఎత్తినవి.

కాల్పనిక యుగం: మహాకవి రవీంద్రుని పృతచ్ఛాయలలో మన ఆంధ్ర కవులు చాలామంది చేరారు. షెల్లీ, కీట్స్, వర్డ్స్‌వర్త్ మొదలైన ఆంగ్లేయ కవుల కల్పనాత్మకధోరణులను అలవరుచుకొన్నారు వీరు. ముఖ్యంగా భావకవులు రాయప్రోలు, కృష్ణశాస్త్రి, అబ్బూరి, దువ్వూరి, శివశంకరస్వామి, విశ్వనాథ, కవికొండల, కాటూరి, పింగళి,నాయని, నండూరి, బసవరాజు, వేదుల—మున్నగువారు.

నవ్యాంధ్ర సాహిత్యఉద్యమానికి ఆద్యులు రాయప్రోలు అని అంటారు. ఈ కవితా ధోరణికి రాయప్రోలు, కృష్ణశాస్త్రి గోత్రప్రవర్తకులని విమర్శకుల తలంపు.

అవును ఇరవయవ శతాబ్దం ఆంధ్ర జాతీయపునరుజ్జీవకాలం. సామాజిక పరిస్థితులలోకలిగిన గొప్పమార్పు ఫలితంగా సాహిత్యంలోకూడా ఒక నూతన దశ ఆవిర్భవించింది. సాహిత్యం, పురాణేతిహాసాలను విడచి, జీవితంనుంచి వచ్చిన ఒక జీవనదిలా పెల్లుబికింది. కాల్పనిక యుగం ప్రారంభమైంది. భారతీయ సంస్కృతికి తోడు పాశ్చాత్య కాల్పనిక సాహిత్య ప్రభావం పడిన భావకవులు పురాణ సాహిత్య రూపాలకూ, ఛందస్సులకూ ఒక వినూత్న సారళ్యాన్ని సమకూర్చారు. జీవితాన్ని ఒక ఆదర్శరూప దృక్పథంతో పరిశీలించి, శైలిలోను భావప్రకటనలలోను స్వేచ్ఛ ప్రయత్నాన్ని ప్రకటించారు. అయితే భావకవులది ప్రధానంగా వ్యక్తిగత దృష్టి కావడంచేత, వారి ఆవేశానికి, ఆవేదనకు ఒక సాంఘిక ఆదర్శంకంటె, ఊహా ప్రేయసి ఆలంబనమైంది. కాని, వీరిలో కృష్ణశాస్త్రి వేదన మహోన్నతమైనది ప్రేయసిపరంగా చెప్పినా, ఆయన వేదన గొప్ప సాంఘిక వేదనగా కనిపిస్తుంది. ఏమైనా ఒకటిమాత్రం సత్యం. భావకవుల కవితాత్మ విశృంఖలతనూ, విస్తృతినీ పొంది నవోద్యమాలను ఎన్నింటినో ఆలింగనం చేసికొన్నది. కాని, ఆ తరవాత మళ్ళీ తెలుగు సాహిత్యాకాశంలో ఒక స్తబ్ద నిశ్శబ్ద నిశీధి క్రమ్ముకొన్నది.—అన్ని గొంతులూ ఒకేలాగ వినిపించాయి. సత్యం మరుగుపడింది, సందేశం అగోచరమయింది. ఈనాడు 'పాలకుల'తో దేశానికి ముఖంమొత్తినట్లు, ఆనాడు భావకవులతో ముఖంమొత్తింది. కాల్పనికయుగం తన ముందుతరంపై తిరుగుబాటుచేసినట్లే, కాల్పనిక కవితాయుగంపై అభ్యుదయ యుగం తిరుగుబాటు జేసి విప్లవాత్మకమైన మార్పులు తీసికొనివచ్చింది.

అభ్యుదయ కవితా ఉద్యమానికి శ్రీశ్రీ ఆద్యుడు: అప్పుడు తెలుగు సాహిత్యాకాశంలో శ్రీశ్రీ వేగుచుక్కలా ఉదయించాడు. పారశీలతో, వాళ్ళ కుట్రలతో కల్మశమైన పాలస్తీన్‌లో జీసస్ గంభీర మేఘ గర్జన వినిపించినట్టు శ్రీశ్రీ కంఠం వినిపించింది. మరో ప్రపంచం కన్పించింది. ఆందోళన ఊపిరైంది. అశాంతి బ్రతుకైనది, ఆక్రందన కవిత్వమైంది. ప్రపంచం స్వార్థపరులుపన్నిన పద్మవ్యూహంఅయింది.

రానున్న మార్పులకు అంకురార్పణ చేసిన శ్రీశ్రీ, ఈ యుగవేదనను, అశాంతిని, విముక్తికై పోరాడుతున్న ప్రగతి శక్తుల సంఘర్షణను తన కావ్యాలలో ప్రచండ శక్తితో గానం చేశాడు. అటు శిథిలమవుతున్న పాత నాగరికతను; ఇటు నిర్మితమవుతున్న నూతన మానవోద్యమాన్ని ఆయన దర్శించాడు. జగన్నాథుని రథ చక్రాలనిస్వనం వినిపించాడు.

శ్రీశ్రీకి గురజాడ మహాకవి గురువైనాడు. ప్రపంచ సాహిత్యోద్యమాన్ని ఆలింగనంచేసుకున్న ఎన్నెన్నో నూతన ధోరణులు — సర్రియలిజంలాంటి ఇజాలు— వచ్చి ఆయనపై వ్రాలాయి. ఛందస్సులు ఛేదించుకుని, జగత్‌కల్యాణం కోసం నూతన గీతాలతో మేలుకొలుపులుపాడాడు ఆయన. తత్వదృష్టిలో భావకవులకంటె భిన్నుడు శ్రీశ్రీ. మరి శిష్టా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం నారాయణబాబు, పురిపండా అప్పలస్వామి ప్రభృతులు శ్రీశ్రీతో గొంతుకలిపి, ఈ నూతన కవితాగానం చేశారు.

శ్రీశ్రీ గొప్ప దర్శనం కల కవి మాత్రమేకాక, శబ్దప్రయోగంలో లబ్ధ ప్రతిష్ఠుడు. సంప్రదాయ సిద్ధమైన వాఙ్మయంలోనుంచి, కవి సమయాలను, ఉపమానాలను ఏరుకొని, వాటిని దేశ కాలపరిస్థితులకు అన్వయించి ప్రయోగించడంలో ఆయనకు ఆయనే సాటి. నిజానికి ఛందస్సును విడిచిపెట్టాలని శ్రీశ్రీ అనుకున్నా, ఛందస్సు ఆయనను విడిచిపెట్టలేదు. కనుకనే శ్రీశ్రీ రచించిన గీతాలు మాత్రాబద్ధమైన ఛందోనిబద్ధమయిఉంటాయి. అది శ్రీశ్రీ గీతమని కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది.

అభ్యుదయ సాహిత్యోద్యమం తొలివాన మొదలు పెట్టినప్పుడు, ఎందరో యువకులు ఈ పన్నీటి జల్లులో తడవాలని వచ్చారు. ఈ విప్లవ సాహిత్య సమర ప్రాంగణంలో ఎందరో అతిరథులు, మహారథులు ధనుర్ధారులై నిలిచారు.

శ్రీశ్రీ తరవాత వచ్చిన అభ్యుదయ కవులను రచనా కాలాన్నిబట్టి స్థూలంగా మూడుతరాల క్రింద విభజింపవచ్చును. వీరిలో కొందరు పూర్వ సంప్రదాయాలను.

భావకవుల పోకడలను విడనాడకపోయినా, తాత్త్విక దృష్ట్యా అభ్యుదయ సాహిత్యోద్యమానికి సన్నిహితులు కావడం జరిగింది.

కావ్య లక్షణం ఏమిటి? 'జిహ్వకొకరుచి–పుర్రెకొక బుద్ధి'– అని లోకోక్తి. కావ్య లక్షణాన్ని నిరూపించడంలో రుచి భేదమునుబట్టి, మన ప్రాచీనులు ఒక్కొక్కరు ఒక్కొక్క త్రోవపట్టారు. ఎవరిత్రోవనువారు సమర్థించుకుంటూ కారణాలుచూపారు. అయితే ఇదంతా కేవలం మార్గదర్శకమే కాని, అనుశాసనం కాదని అందరూఅన్నారు. అవును మరి. ఎప్పటికప్పుడు అనేక వాహినులను కలుపుకుంటూ ఒక అనంతమహావాహినిలా ప్రవహించే కావ్య జీవతరంగిణిని ఎవరు అనుశాసించగలరు?

కావ్యాత్మ 'రసం' అన్నాడు భరతుడు. అలంకార విశేషభూషితమైన వాక్యం కావ్యం–అన్నాడు భామహుడు. శబ్దార్థాల జంటయే కావ్యం–అన్నాడు రుద్రటుడు. మరి–రీతి కావ్యాత్మ అన్నాడు వామనుడు. వాక్యానికి గుణం ప్రాణం అన్నాడు దండి. కాదయ్యా, ధ్వని ప్రధానమన్నాడు ఆనందవర్ధనుడు. వక్రోక్తి కావ్యానికి జీవం అన్నాడు కుంతలుడు. కాదు, ఔచితి ప్రధానం అన్నాడు క్షేమేంద్రుడు. మరి–రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్యం–అన్నాడు పండిత జగన్నాథుడు.

అయితే 'విశ్వశ్రేయః కావ్యం'–విశ్వశ్రేయస్సును కలిగించేదే కావ్యం–అన్నసంగతి భరతుని మొదలు–పండిత జగన్నాథుని వరకు అందరూ అంగీకరించారు. కనుక కావ్య ప్రయోజనం ఏమిటి?– అన్నప్రశ్నకు ఇదే సమాధానం. ఆనందం కలిగించడంతోపాటు లోకానికి సదుపదేశాన్ని అందించడం. మరి, ఇందుకుగాను కవికి ఒకానొక తాత్త్వికదృష్టి, ఒకానొక 'ఫిలాసఫీ' ఉండాలి. కవి ఉపదేష్ట, కావ్యం ఉపదేశం కావాలి. ఉపదేష్టకాని కవి, కవికాడు ఉపదేశంలేని కావ్యం, కావ్యంకాదు. ఉపదేశం అంటే, రాజకీయ నినాదాలు ప్రచారం చేయడం కాదు. ఇతఃపూర్వం చెప్పినట్లు, ఆ ఉపదేశం అన్నది రసాత్మకంగా, రమణీయంగా ఉండాలి. కనుక, దీనివలన తేలిందేమిటయ్యా అంటే– కవి కావ్యం వ్రాయడం తనకోసంకాదు–లోకం కోసం, సమాజం కోసం. కేవలం ఆత్మానందం కోసమే రచనలు చేస్తున్నామని ఎవరన్నా చెపితే, అది శుద్ధ అబద్ధం. సమాజ శ్రేయస్సును ఆకాంక్షిస్తూ అభ్యుదయ కవులు రచనలు చేశారు.

అభ్యుదయ కవితాలక్షణం: ఆందోళన, అసంతృప్తి, ఆవేదన, భయం, ఆశ, నిరాశ, విప్లవం, ముందుచూపు–ఈ యుగానికి ప్రధాన లక్షణాలయినాయి. ఈ లక్షణాలే

సాహిత్యంలో ప్రవేశించాయి. జాతులన్నీ ఏక కుటుంబంగా పెనవేసుకొని పోవడంచేత, సాహిత్యంలో మానవుడు విశ్వప్రతినిధిగా రూపొందాడు. ఈ కవులలో వ్యక్తి చైతన్యం, సాంఘిక చైతన్యంగా విస్తరిల్లింది. నేటి సాంఘిక విషవలయంలో చిక్కిన మానవునికి, సోషలిజం, మార్క్సిజంలాంటివి నిష్కృతి మార్గాలుగా కనిపించాయి. కనుకనే అభ్యుదయ కవులు వివిధ అంతర్వైరుధ్యాలతో సంఘర్షిత మవుతున్న సంఘ సంగీతాన్ని గానంచేశారు. అసమసంఘ వ్యవస్థా బంధనలో నలిగి నీరసించిపోతున్న మానవకోటికి తమ విప్లవ కవితామృతధారలతో ప్రాణంపోశారు. యుద్ధం, పరపీడన, ఆర్థిక అసమానత, మున్నగువాటిని ద్వేషించారు. శాంతి, సౌభాగ్యాలతో విలసిల్లే నవమానవ సమాజప్రాదుర్భావాన్ని ఆశించారు. సమాజంలో, లేదా సామాన్యవ్యక్తి జీవితంలో అనుదినం సంభవించే కష్టసుఖాలన్నీ అభ్యుదయ కవులకు కావ్యవస్తువులయినాయి. బిచ్చగాడు, పిచ్చివాడు, బీదరైతు, దిక్కుమాలిన కూలి, కష్టజీవి, కార్మికుడు, నిరుద్యోగి, పతిత, పరిత్యక్త – అదేమిటి, ఇదేమిటి – అన్నీ వీరి రచనలకు ఇతివృత్తాలయినాయి. వీరందరూ తమ కావ్యకల్పనల ద్వారా అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని పరిపుష్టంచేశారు.

అన్ని గొంతులూ ఒకటేనా? ఏమయ్యా – అందరూ శ్రీశ్రీని అనుకరించారు, ఒకేగొంతు అనేక గొంతులుగా పలికింది – అని ఒక ఆక్షేపం,

అందుకు సమాధానంఇది: మనిషినిపోలిన మనిషి ఉన్నా ఏ ఇద్దరు మనుష్యులూ ఒక్కలా ఉండరు. అలాగే కావ్యంపోలిన కావ్యంఉన్నా, ఏ రెండు కావ్యాలూ ఒక్కలా ఉండవు. ఒక యుగంలో ఒకే తాత్త్విక దృష్టిగల సమకాలీన కవుల రచనలలో పోలికలు ఉండవచ్చును, అది సహజం. అది ఈనాడే కాదు, ఆనాడూ ఉన్నది. అంతమాత్రంచేత అది అనుకరణాకాదు. ఎవరి ప్రతిభ వారిది. ఎవరి వ్యుత్పత్తి వారిది. ఎవరిసాధన వారిది – ఎవరి సాధనను బట్టి వారికిసిద్ధి! – వివిధ స్వరాలలో సాగింది ఈ సమర సంగీతం.

ఎన్నో మణిదీపాలు: అభ్యుదయ కవులు ఉత్తమ కావ్యాలు అనేకం వెలయించారు. వాటిలో కొన్ని పేర్కొంటాను.

శ్రీశ్రీ – మహాప్రస్థానం, ఖడ్గసృష్టి, మూడు యాభైలు; నారాయణబాబు – రుధిరజ్యోతి; పురిపండా – గీతాలు; ఏల్చూరి, రామదాసు, కుందుర్తి రచించిన – నయాగరా; ఆరుద్ర – త్వమేవాఽహమ్, సినీవాలి; అనిసెట్టి – అగ్నివీణ; పఠాభి – ఫిడేల్

రాగాల డజను; సోమసుందర్—వజ్రాయుధం, రక్తాక్షి, కాహళి; రెంటాల-సంఘర్షణ, సర్పయాగం, శివధనువు; కాళోజి—నాగొడవ; శిష్లా—విష్ణు ధనువు; కొనకళ్ళ—పాటలు; దాశరథి—రుద్రవీణ, అగ్నిధార, పునర్నవం, మహాంధ్రోదయం; నారాయణరెడ్డి— జలపాతం సమదర్శనం; రాంషా—అనంతం; తెన్నేటిసూరి — అరుణరేఖలు; రమణారెడ్డి—అడవి, భువనఘోష, అంగార వల్లరి; బైరాగి—నూతిలో గొంతుకలు; శశాంక—నయాజమానా; విద్వాన్ విశ్వం—పెన్నేటిపాట; నార్ల చిరంజీవి—గేయాలు; రాంభట్ల—శరవిషాణం; రజనీ కాంతరావు—శతపత్ర సుందరి; కవిరాజమూర్తి— మహైక, ప్రణుతి; శార్వరి—రోదసి; దుర్గానంద్—అంతర్గోళాలు; నారపరెడ్డి— అశ్రుమాల, బాష్పకణాలు; కారుమంచి—పాంచజన్యం; గంగినేని—ఉదయిని; కుందుర్తి—తెలంగాణా, యుగేయుగే—ఇత్యాదులు.

గొప్ప కవుల లక్షణాలు ఈ కవులలో పలువురికి ఉన్నాయి, వీరి కావ్యాలలో మణి దీపాలవంటివి కొన్ని ఉన్నాయి. ఈ కావ్యాలలో భీమమనోజ్ఞంగా వర్ణించిన ఘట్టాలు పెక్కులున్నాయి. ఆత్మవిశ్వాసం, చిత్త శుద్ధి, ఈ కవులలో కొట్ట వచ్చినట్టు కనిపిస్తాయి. ఆత్మాశ్రయ కవిత్వంలో కొందరు కథా కథనంలో కొందరు గొప్ప ప్రజ్ఞావంతులు. నిస్సందిగ్ధమైన సంకల్ప బలం పలువురిలో గోచరిస్తుంది.

ఆధునిక కవిత్వంలో మరొక విలక్షణం వచన కవిత. ఆంగ్ల కవులు ఇలియట్ ప్రభృతులు చేపట్టిన 'బ్లాంక్‌వర్స్' లాంటిది ఇది. ఈ కవిత ఛందో బద్ధం కాని వచనంగా సాగినా, ఒకానొక ఊపు, ఊగు ఇందు అంతర్లీనమై ఉంటుంది. అటనట అంత్యప్రాసలు కూడా. అయితే వచన కవిత ఇప్పటి యువకులు పలువురను కుంటున్నట్టు అంతతేలిక అయిన ప్రక్రియకాదు. కవి గొప్ప ప్రతిభావంతుడైతే తప్ప, ఇదికవితగా నిలవదు. అతనికి గొప్ప "విషన్", దర్శనం, ప్రగాఢమైన భావావేశం ఉంటేతప్ప ఈకవితను అల్లలేడు. మరి, వచన కవిత్వానికి ప్రాణంపోసి దానికి విశిష్టత చేకూర్చిన వారు కుందుర్తి, బాల గంగాధర తిలక్ ప్రభృతులు.

ఇక మూడవతరానికి చెందిన కవులున్నారు. గజ్జల మల్లారెడ్డి, గోపాలచక్రవర్తి, కమ్మిసెట్టి వెంకటేశ్వరరావు, సి. విజయలక్ష్మి, జె. బాపురెడ్డి, గోవిందరెడ్డి, రమణశ్రీ, రంగబాబు, ఉదయభాను, సానికొమ్ము, స్వర్ణరాజ హనుమంతరావు ప్రభృతులు.

ఇంకా ఇప్పు డిప్పుడు కవిత్వం వ్రాస్తున్న వారందరినీ నాల్గవ తరం వారుగా భావించవచ్చు.

మూడవ తరం కవులలో గజ్జల మల్లారెడ్డి ప్రతిభావంతుడు. అయోమయం, అస్పష్టత వ్యర్థ పదప్రయోగం లేకుండా, అచంచలమైన ఆత్మవిశ్వాసంతో ఈ కవి కవితా గానం చేశాడు. ఈయన గేయాలలో ఒకానొక ధ్వని, వ్యంగ్యం అంతర్భూతమై ఉంటుంది. ఈ తరం కవులుకూడా కొన్నిగేయ సంకలనాలను వెలయించారు.

శ్రీశ్రీ మొదలు ఈ తరం కవులవరకూ వెలువడిన కొన్ని విశిష్ట రచనలతో అభ్యుదయ కవితా సంకలనాలు ప్రచురితమైనవి. అందు ముఖ్యమైనవి-కల్పన, ఉదయ ఘంటలు, శ్రీశ్రీ యుగం, స్వేచ్ఛాపథం, ప్రజాశక్తి గేయాలు, గురజాడ అడుగుజాడ యువసాహితీ మున్నగునవి.

తెలుగుతల్లి, జ్వాల, విశాలాంధ్ర మాసపత్రిక, ఉదయిని, నవ్యసాహితి, అరుణరేఖ, సంధ్య, అభ్యుదయ, నగారా, కవిత, నవత, పత్రికలు అభ్యుదయ కవుల రచనలు ప్రచురించి వారిని ప్రోత్సహించినవి.

కొత్తచిగురు: ఆధునిక తెలుగు సాహితీలత ఇటీవలనే ఒక కొత్త చిగురు వేసింది. 1965 మే ఆరవ తేది అర్ధరాత్రి, ఆధునిక సాహిత్యాకాశంలో కొన్ని క్రొత్త తారకలు తళుక్కు మన్నాయి. ముచ్చటగా షడ్రుతువులవలె ఆరుగురు కవులు— దిగంబర కవులను పేరుతో ఆంధ్ర రాజధాని నగరంలో ఆవిర్భవించారు. కొత్త పుంతలు తొక్కి క్రొత్త గొంతులు వినిపించాలని వీరి ఆశయం కాబోలు—ఒక రిక్షా కార్మికుడు ఈ కవుల తొలి కవితా సంపుటిని ఆవిష్కరించడం విశేషం. వర్తమాన సమాజంపట్ల అసంతృప్తి, ఆవేదన వీరిలోనూ ద్యోతకం కావడాన్నిబట్టి తాత్వికదృష్ట్యా వీరున్నూ అభ్యుదయ కవులకు సన్నిహితులేనని భావించవచ్చును. నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్న—అను ఈ ఆరుగురు దిగంబర కవుల ద్వితీయ కవితా సంపుటికూడా—మొన్న డిసెంబరు 18వ తేదీ ఆదివారం అర్ధరాత్రి విజయవాడ సెంటర్‌లో వెలువడింది. ఏమైనా వీరిధోరణి ఇంకా ముందు ఎట్టి పరిణతి చెందగలదో చూడవలసి ఉన్నది.

దోష ప్రకరణం: శ్రీశ్రీ నుండి నేటి వరకు—అభ్యుదయ కవితా ఉద్యమాన్ని గురించి స్థూలంగా సింహావలోకనం చేశాను. ఈ కవితావృక్షం నేడు శాఖోపశాఖలుగా విస్తరిల్లుతున్నది. ఈ నాడు పలువురు యువకులు ఈ వృక్షచ్ఛాయల క్రిందచేరి యథాశక్తి కృషిచేస్తున్నారు.

అయితే ఒక్క విషయం. గుణదోష విచారణచేసేటప్పుడు— కేవలం గుణాలను స్మరించి దోషాలను విస్తరించడం మహాదోషమే అవుతుంది. అలాగే కేవలం దోషాలను ఎన్నుతూ కూచుని గుణాలను గ్రహించ లేక పోవడం విమర్శకుని సంకుచితదృష్టిని వ్యక్తం చేస్తుంది. ఇంతవరకూ ఆధునిక కవిత్వంలోని కొన్ని గుణాలు చెప్పాను. ఇక దోషాలను గురించి ప్రస్తావిస్తాను.

మొదటితరం, రెండవతరం కవుల రచనలలో ఉత్తమ శ్రేణికిచెందిన రచనలతో పాటు నిస్సారము, పేలవము, దోషభూయిష్ఠము అయిన కావ్యాలుకూడా అనేకం ఉన్నాయి. అంతేకాదు. రానురాను వీరిలోనూ ప్రతిభ సన్నగిలింది. లక్ష్యం దెబ్బతిన్నది. పలువురు సినిమాలలోచేరి నిశ్చింతగా ఉంటున్నారు. ఎవరో ఒకరిద్దరు తప్ప దీక్షతో, చిత్తశుద్ధితో, రచనలు చేస్తున్నవారు లేరు. సినిమాలకు వ్రాయడం తప్పనికాదు కాని ప్రతిభావంతులైనవారు సాహిత్యోపాసనకు స్వస్తిచెప్పి, సినిమాలలోనే అపూర్వకల్పనలు చేస్తున్నామని తృప్తిపడడం శోచనీయం. కాగా ఈతరం 'కవులలో' బహుముఖమైన శాస్త్ర పరిశీలన, పరిజ్ఞానం కొరవడింది. వివిధ సాహిత్య ప్రక్రియల చేపట్టి సాహిత్య సీమలో సుస్థిరస్థానం సంపాదించుకోలేకపోయారు. వీరికావ్యాలలోను అస్పష్టత, అయోమయం, వ్యర్థ పదప్రయోగం, దుష్టమైన శైలి. పుబముడు—పెక్కుచోట్ల ప్రత్యక్షమై, ముళ్ళలా గ్రుచ్చుకుని పాఠకుని, విమర్శకుని కూడ బాధిస్తాయి. ముఖ్యంగా అస్పష్టత ఉన్నదే— అది సర్వేసర్వత్రా పరిత్యజించదగిన పెద్ద దోషం.

నాటినుండి నేటిదాక కలం ఆపకుండా రచనలు సాగిస్తున్న ఆధునిక కవులలో ఆరుద్ర, సోమసుందర్ ప్రభృతులున్నారు. ఇట్టి అవిరళకృషి సాగిస్తున్నందుకు వీరిని అభినందించవలసినదే. అయితే ఆరుద్ర రచనలలో గంభీరత, ఉత్తమ కావ్యలక్షణాల కంటే ట్రిక్కులు, సర్కస్ ఫీట్లు ఎక్కువ. చిత్రకవిత్వం కాలక్షేపానికి బాగానే ఉంటుంది. కాని సర్కస్ ఫీట్లతో కవిత్వం నిలుస్తుందా?

కవి వయస్సుతోపాటు, అనుభవంతోపాటు అతని ప్రజ్ఞ, తాత్త్వికదృష్టి పరిణతిచెందాలి. అతని కవిత ప్రౌఢత్వాన్ని, సౌష్ఠవాన్ని, సౌందర్యాన్ని సంతరించుకుని ఒక మహాకావ్య లక్షణాన్ని (Epic Quality) పొందాలి. మరి, అభ్యుదయ కవులు చాలమందిలో అటువంటిది ఉన్నట్టు కనిపించదు. సోమసుందర్ రచనలలోనూ ఇంకా అస్పష్టత, అయోమయం పోలేదు. ఈనాడు ప్రముఖంగా రచనలు సాగిస్తున్న వారు కావడంచేత వీరిని గురించి ప్రస్తావించాను, మరోతలంపుతో కాదు.

ఈ తరం కవులు మరి కొందరు పత్రికలలో చేరి, నానా కశ్మలాన్నీ వాటిలో పేరుస్తూ, దేశాన్ని ఆస్పత్రిలా అల్లకల్లోలం చేస్తున్న నేటి రాజకీయ నాయకుల ఊక దంపుడు ఉపన్యాసాలను, ఉద్ఘాటనలను, పునరుద్ఘాటనలను చర్విత చర్వణంగా, పిష్ట పేషణంగా వ్రాసుకుంటూ చల్లగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు. చూడబోతే సినిమా కవులకూ వీరికీ కూడ కవులుగా జీవించాలని లేనట్టున్నది! ఇంకా కొందరున్నారు. ఎక్కడలేని నిరాశా, నిస్పృహలు నీలినీడల్లా ఆవహిస్తే, క్రుంగిపోయి కూచున్నారు. వర్తమాన విషవర్తులాన్ని ఛేదించుకుని, భవిష్యత్తులో అడుగు పెట్టలేక, ఎటూ పాలుపోక, ఏమితోచక గిజగిజ తన్నుకుంటూ అపర భీష్మల్లా అస్త్రసన్న్యాసంచేసి అంపశయ్యపై పడుకున్నారు మరి కొందరు కవివరేణ్యులు!

ఇక మూడవతరం, నాల్గవతరం కవులలో ప్రతిభా వ్యుత్పత్తులు కలవారు చాలా కొద్దిమంది. ఇంకా ఇప్పుడిప్పుడే వస్తున్న కవులకు లెక్కలేదు. అదేమి పాపమో కాని కలంపట్టిన ప్రతివాడికీ కవిత్వం చాలా చులకన అయిపోయింది ఈ రోజుల్లో! క్షణంలో ఒక గేయంవ్రాస్తాడు. పత్రికలు అచ్చువేస్తాయి. తానొక కవినని మురిసిపోతాడు. అవునుమరి— నేటి కవిత్వానికి ఏ నియమాలు లేవు. ఛందస్సు, వ్యాకరణం అక్కరలేదు. కనుక ఏది వ్రాసినా కవిత్వమై ఊరుకుంటుందని వీరి ఉద్దేశ్యం కాబోలు! భాషాజ్ఞానం సున్న. పూర్వసాహిత్య పరిచయం పూజ్యం. భారం లేని కవిత్వం. ఏదో ఉబలాటంతప్ప కావ్యానికి ఊపిరిఏదో తెలియదు. చిత్తశుద్ధి. నిజాయితీ. ఒకతాత్త్వికదృష్టి—ఎెదికిచూచినా కనిపించవు. ఒక గొప్పదర్శనం లేనివాడు. జీవితంలో ఒక సన్మార్గం చేపట్టనివాడు లోకానికి ఏం ఉపదేశంచేస్తాడు? చేస్తేమాత్రం ఎవరు పాటిస్తారు?

సమాజం సువర్ణంలాంటిది. కవి లేదా రచయిత స్వర్ణకారుడు. ఈ సువర్ణాన్ని ఏవిధంగా మలచవలెనో, తన మార్గం ఏమిటి, తన ఆదర్శంఏమిటి, తన ఫిలాసఫీ ఏమిటి, నిర్ణయించుకోవలసినవాడు రచయిత. మరి, ప్రతిభావంతుడైన కవి, లేదా రచయిత తన కావ్యసృష్టితో సమాజాన్ని ఆకర్షించి, ఆకట్టుకొని, తన ఆదర్శాల వైపు సమాజాన్ని మరలిస్తాడు.

అసలు, సాహిత్యాన్ని కాని, ఏకళనే కాని, దాని స్వరూప స్వభావాలేమిటో తెలియకుండా అభ్యాసం చేయబూనడం దారితెలియకుండా ప్రయాణం చేయడం లాంటిది. ఇది ప్రమాద హేతువు.

ఇక రచనలలో వాస్తవికతను గురించి కూడా నేటి రచయితలతో స్పష్టమైన సరియైన అభిప్రాయం ఉన్నట్టుతోచదు. సమాజంలో, లేక ఒకవ్యక్తి జీవితంలో ఒక సంఘటన జరిగితే దానిని యథాతథంగా చిత్రించడమే వాస్తవికత అని, నేడు పలువురు అభిప్రాయపడుతున్నట్టు కనిపిస్తున్నది. కాని, ఇది భ్రమప్రమాదజనితం. ఒక ఫోటో గ్రాఫర్ మన బొమ్మ ఫోటోతీస్తాడు, లేదా ఒక చిత్రకారుడు మన బొమ్మ గీస్తాడు. అది అచ్చంగా మనబొమ్మే. కాని, అద్దంలో మన ముఖంకంటె ఆ బొమ్మలో మన ముఖం అందగా ఉన్నట్టు కనిపిస్తుంది. ఎందుచేత? ఎందుచేతనంటే, మన బొమ్మను యథాతథంగా చిత్రించడంతోపాటు, ఒకానొక అందాన్ని అందులో పొదుగుతాడు ఫోటోగ్రాఫరు లేదా చిత్రకారుడు. కనుకనే దానినిచూచి మనం మురిసి పోవడం. అదే శిల్పం మరి, ఆశిల్పమే అందులోలేకపోతే, మనం మన ముఖాన్ని చూచుకుని మురిసి పోవచ్చును. బొమ్మతో పనిలేదు. కనుక వాస్తవికతలో ఒకానొక శిల్పాన్ని పొదిగి నప్పుడే. రచన రమణీయమూ, రసాత్మకమూ అవుతుంది. మరి, ఇది తెలియకుండా వాస్తవికత పేరుతో ఉన్నది ఉన్నట్టుపేర్చిస్తే, అది కావ్యమూ కాదు, కళాఖండమూకాదు.

అంతేకాదు ప్రతి జాతికి, ఒక భాష, ఒక సంస్కృతి, ఒక సంప్రదాయ లక్షణంఉన్నాయి, ఇవన్నీ క్షుణ్ణంగా తెలుసుకోవడం అవసరం. ఏకీభవించినా, ఏకీభ వించకపోయినా, సమకాలీన సాహిత్యంతోపాటు పూర్వకవుల, లాక్షణికుల గ్రంథా ధ్యయనం చేయాలి. వాటిలోని గుణాలు, మెలకువలు, చమత్కారాలు, ఔచితి— గ్రహించడం అవసరం. మరి ఇవేవికాకుండా ఎకాఎకి రచనలకు పూనుకోవడం, ఏచిత్ర సచిత్ర వారపత్రికలోనో ఒకటివ్రాసి, మహా రచయితలమైనామని మురిసిపోవడం, చంక ఎగురవేయడం సాహసం, నేలవిడిచిన సామూను. అస్త్ర శస్త్రాలులేకుండా సమర రంగంలో అడుగు పెట్టడంలాంటిది.

కావ్యం రచించండి, కథఅల్లండి, నవల వ్రాయండి, నాటక రచనచేయండి— ఏ రచనకైనా భాష శరీరం, భావం ప్రాణమూను. ఇవి రెండూ అన్యోన్యాశ్రయాలు. భాష లేని భావం మూగది. భావంలేని భాష వాసనలేని పువ్వులా వ్యర్థం. కనుక భాషా స్వరూపాన్ని తెలుసుకోవాలి.

మరి, ఈ లక్షణాలన్నీ నేటిరచయితలలో చాలాఅరుదుగా కనిపిస్తున్నాయి— చూడండి! భేదము, బేధము— ఈ రెంటికీ భేదమేమిటో, ఏదిఒప్పో ఏదితప్పో కూడా తెలియని స్థితిలో కొందరు రచనలు సాగిస్తున్నారు. ఇది ఆరోపణకాదు, సత్యం. పరిశీలిస్తే తెలుస్తుంది. ఇక శైలికూడా అస్తవ్యస్తంగా ఉంటున్నది. "వస్తున్నది—

వస్తూఉన్నవి–వస్తున్నవి–వస్తోన్నవి–వస్తోన్నాయి–వస్తున్నాయ్–చివర'యి'కారపోల్లు– వస్తున్నె!–ఇలా ఒకేమాటను పలురకాలుగా వ్రాస్తున్నారు। ఇందులో ఏది సరియైనది? ఏది సాధువు? ఏది అసాధువు? అన్నీ సరియైనవేనని అనుకుందాం. కాని ఇది భాషా వ్యతిక్రమం. వీటిల్లో ఏదో ఒక రూపాన్ని స్వీకరించడం మంచిది. అంతేకాని, ఎవరి యిష్టంవచ్చినట్లువారు వ్రాయడంవల్ల భాష వికృతంగా తయారవుతుందే తప్ప పరి పుష్టము, సౌందర్యవంతము కాదు. సంస్కారోపేతమైన మంచి భాష ఉన్నప్పుడే మంచి భావనకు ఆలంబనం అవుతుంది. మంచిభావం చెడ్డ భాషతో ఎప్పుడూ వెలువడదు!– ఏదీ?– చెడ్డభాషలో వ్రాసిన ఒక మహాకావ్యాన్ని చూపండి చూద్దాం! కావ్యానికి రీతి, స్నిగ్ధత, సంస్కారం, భాషాసౌష్ఠవం, ప్రదీప్తప్రజ్ఞ– పంచప్రాణాలు.

మరొక్క విషయంచెప్పి ఈ ప్రసంగాన్ని ముగిస్తాను. భావకవులకు–పూల చెండ్లు, పూబోండ్లు, వెన్నెల, కన్నెపిల్ల, చిపురాకు, భీతహరిణేక్షణ, సుమదామం పువుదీవె— ఇత్యాది మెత్తమెత్తని మాటలు పడికట్టురాళ్ళు అయినాయి. అందరి కవిత్వంలోనూ అవే ప్రత్యక్షమైనాయి. వీటితో ముఖంమొత్తి వీరిపై తిరుగుబాటు చేసిన అభ్యుదయకవులు కూడా చివరకు అదేపనిజేశారేమోననిపిస్తుంది! ఆకలి ఎఱుపు, రక్తం, జయపతాక, శంఖారావం, నడవండి, పదండి, ఎలుగెత్తిచాటండి విప్లవం, అభ్యుదయం, సమభావం, సమధర్మం, జనం, మనం, ఘనం – ఇత్యాది శబ్దాలు– వీరికీ పడికట్టురాళ్ళు అయినాయి. భావనలోనేమి, శబ్దప్రయోగంలోనేమి నూతనత్వాన్ని సంతరించుకోకపోతే ఎప్పుడూ ఇంతే. అభ్యుదయ కవిత్వంలో పదేపదే— ఈ పదాల విరుపులను వినివిని, లోకానికి ముఖం మొత్తింది! అందుకే ఆధునిక ఆంధ్రకవితా సీమలో ఈనాడు ఒక అంధకారం ఆవరించింది. స్తబ్దత, అవ్యవస్థ, అయోమయం ఏర్పడ్డాయి: ఎంతకాలం ఈ పరిస్థితి? ఏమిటి కర్తవ్యం?

నేటి కవులు, రచయితలు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఈనాడు ఆవరించిన అంధకారాన్ని అవ్యవస్థను, అయోమయాన్ని ఛేదించి, అరుణారుణ కాంతులు వెద జల్లుతారని ఆశిస్తున్నాను. నేటి మానవుడు భూతకాల భూతశాలను విడిచి, వర్తమాన విషవస్తులాన్ని ఛేదించుకొని, ఉజ్జ్వల ప్రశాంత భవిష్యకాల కుసుమ కుటీరం చేరడానికి బాటవేస్తారని విశ్వసిస్తున్నాను.

( 8-1-'67 న కృష్ణాజిల్లా తెలుగు రచయితల సభలో చదివిన ప్రసంగ వ్యాసం )

* *

సాహిత్య లేఖలు:

## దిగంబర కవులు — 2

ఒక ముఖం ఉన్నదనుకోండి. ఆ ముఖంలో చెప్పుకోదగిన కళ ఉన్నది. కంటి చుట్టూ అరంగుళంమేర బొగ్గుపొడి దట్టంగా పులమబడిఉంది—పెదిమలు పగిలి రక్తం చీమూ కారుతున్నై. ముఖాన దట్టమైన బూడిద తిలకం పెట్టబడిఉన్నది-ఈ అలంకరణని అందం అనుకోమంటే అది దారుణం కాదా? Conciousగా, ఉన్నకళని నాశనం చేసుకోవడంకాదా? ఎవడో నాలాటివాడు కళనీ, కప్పుకున్న వస్త్రాన్నీ వేరుచేసి చూసే సహనం కలిగి ఉంటాడు. మరొకడు దూరంనించి కళ్ళుమూసుకొని వెళ్ళిపోతాడు. అప్పుడు లక్ష్యమే నెరవేరదు గదా! రాజకీయాలకతీతంగా ఉండాలని చెప్తూ, కవిత్వమంతా దానికే అంకితంగాఉంది.

"మేధస్సుకీ హృదయానికీ మధ్య ఉన్న తడితీగ తెగింది."
"అహంకారపు సిలువమీద నవ్విన నెత్తురు గులాబీని నేను."

ఇంత ఉత్కృష్ట ధ్వనితో కవిత్వం చాలాచోట్ల ఉన్నది. ఒక ఉద్రిక్తమైన శైలిఉంది. కాని తిరగమూతవిషంతో వెయ్యబడింది. విషమంటే సిద్ధాంత సంబంధం కాదు. కళా సంబంధమైన భీభత్సం. డాడాయిజమ్‌ని రసభంజకంగా చేశారు వీళ్ళు. ఒక పాదం చూచి, అందులోని శిల్పం చూసి ఆకర్షింపబడబోయే వాడికి, రెండో పాదంలో "మర్మాంగాల్ని" చూపి వెనక్కి తిప్పేస్తున్నారు. ఈ దిగంబరత్వం ఎవర్నీ లోగొనదు. వారి లక్ష్యం చేతులారా చెడగొట్టుకుంటున్నారు— సమాజాన్ని మార్చడానికి వాళ్ళని బూతులు తిట్టడం మార్గంకాదు— కారాదు.

—రామమోహనరావు.

'సృజన' అందింది. అందడమూ, అమాంతంగా చదివేయడమూ అయింది. ఈసారి సంచిక 'సత్తా' పెరిగింది. దాశరథి ఆరుద్రల గీతాలు, సాహితీ విమ్మరన వ్యాసాలు—ముఖ్యంగా బాగున్నవి. ఈ స్థాయిలోనే పత్రిక కొన్ని కాలాలు నడిస్తే 'ఆధునిక సాహిత్య వేదిక'గా అక్షరాలా రుజువు చేసుకుంటుంది. దీనికి వెన్నెముకగా ఉన్న 'సాహితీ మిత్రుల్ని' గాఢంగా అభినందిస్తున్నాను.

—సి. నారాయణరెడ్డి.

శ్రీశ్రీ "ఖడ్గసృష్టి" సమీక్షా సమీక్ష

# మనః కార్మికశాల

కె. వి. రమణారెడ్డి

"ఇవాళ మళ్ళీ అలాగ
ఎలాగ రాయగలను నేస్తం?
ఇరవయ్యో ఏడు నాకు మళ్ళీ
ఎలావస్తుంది చెప్పు?"

అరవయ్యో ఏడు మరి మూడేళ్ళ దూరంలోనే ఉన్నప్పుడు, శ్రీశ్రీకి ఇరవయ్యో ఏడు కాదుగదా, ముప్పయ్యో ఏడైనా ఎలా మళ్ళీ వస్తుంది చెప్పండి? అరవయ్యో ఏటి తర్వాత, వస్తేగిస్తే ద్వితీయ బాల్యం వస్తుందేమోగాని, చలంగారన్నట్లు 'యవనవ్వనం' గాని, శ్రీనాథుడన్నట్లు 'ప్రౌఢ నిర్భర వయః పరిపాకము' గాని మళ్ళీమళ్ళీ రమ్మంటే వచ్చేవికావు. చంద్రుడు అర్థంచేసుకోలేదని కవి నేరుగా మొరపెట్టుకొంటున్నాడు. నిజానికి మొరపెట్టుకోవలసినది శరచ్చంద్రునికి గాదు, శరత్పూర్ణిమనాటి చంద్రబింబంలాగా గుండు సున్నలవంటి వివేచనను కలిగిన విమర్శకులకు, సమీక్షకులకు, విమర్శక—సమీక్షకులకు!

1937 నుండి 1957 వరకు, అటుతర్వాతకూడా శ్రీశ్రీ రాస్తూవచ్చిన కావ్యఖండికలను కొన్నిటిని "ఖడ్గసృష్టి" పేరుతో క్రిందటేడు విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రకటించింది. వెల మొదలు విషయసూచిక లేదనే విషయం వరకు పత్రికా సమీక్షకులు ఎత్తిచూపి, పెదాలు చప్పరిస్తూ, కనుబొమలు విరుస్తూ, "ఈ సంపుటిలో ఉన్నదంతా ఉత్తమ సాహిత్యం అనడానికి లేదు. శ్రీశ్రీ ఇట్లాంటివికూడా ఎందుకు రాస్తాడు చెప్మా అనిపించే గేయాలూ ఉన్నాయి ఇందులో" (ఆంధ్ర సచిత్ర వారపత్రిక: 'హిమబిందు') అనీ, "ఏమైనా మహాప్రస్థానం తర్వాత యీ ఖడ్గసృష్టిని శ్రీశ్రీ కవితగా మరచిపోవాలనిపిస్తోంది" (వాణి: త్రిపురనేని వెంకటేశ్వరరావు) అనీ అన్నారు. ఇలాంటివారే తదితరులు. వీరు యావన్మందీ శ్రీశ్రీ అభిమానులే, "మహాప్రస్థానం" ఆరాధకులే. అయినా వీరు ఒక విషయాన్ని గమనించ లేదు. ప్రతి కవికీ వృద్ధిక్షయాలుంటాయి. వృద్ధిని క్షయమని పొరబడితే వచ్చే అనర్థమే ఈ విమర్శకుల

చిత్తవృత్తిలో కనిపిస్తున్నది. తమ కళ్ళకూ మెదళ్ళకూగల పాటవంగురించి పునరాలోచించుకోవలసినవారే కవిత్వ విమర్శకులు కావడం నిజంగా విచారకరమైన విషయం.

'సాహిత్యం' బళ్ళకొద్దీ టన్నుల లెక్కను ఉత్పత్తి అవుతున్న దేశంలో కాలంలో 'విమర్శ' బొన్నుల చొప్పుననైనా వెలువడక పోవడం, ఆరోగ్యానికి చిహ్నం కాదు. బాగా చదువుకున్న పాఠకులు కూడా 'ఖడ్గసృష్టి' చదివి పెదవి విరిచారు. నాకు ఆశ్చర్యమూ దుఃఖమూ కలిగాయి.

'సోవియట్ భూమి' అవార్డు రు. 8000-/ రొక్కం బహుమానం, రష్యా పర్యటనావకాశం లభించాయి కాబట్టి ఈ గ్రంథం గొప్పదై ఉండాలని నేను తీర్మానించుకోలేదు. నిజానికి, ఆ అవార్డు సందర్భాన్ని పురస్కరించుకొని బెజవాడలోని ఒక సుప్రసిద్ధ గ్రంథాలయంలో జరిగిన సన్మాన సభలో 'ఖడ్గసృష్టి' ప్రసక్తి ప్రశస్తి కలికానికైనా కానరాకుండా 'మహాప్రస్థానం' పునరపి ప్రసక్తమైనదని చాలమందికి తెలిసి ఉండకపోవచ్చు. సాహిత్య అకాడమివారి మదికెక్కని ఈ కావ్య గ్రంథాన్ని 'సోవియట్ భూమి' సత్కరించడం, రచ్చగెలిచి ఇంటగెలవక పోవడం వంటిదే కావచ్చు.

అయినా కాకున్నా 'ఖడ్గసృష్టి' అన్నివిధాలా 'మహాప్రస్థానం' తోబుట్టవేగాని అన్యంకాదు. ఆ మొక్కల్లే, ఆ ముద్రలే, ఆ మాటతీరే, ఆ సంతకమే! దాని ఫలమే ఇది. ఆరుద్ర ఒకప్పుడు శ్రీశ్రీని నిత్యహరితమైన వృక్షంతోటి పోల్చారు. వివర్ధనమే వృక్షస్వభావమైతే, 'మహా ప్రస్థానం' శ్రీశ్రీ కవితావసంతమని, 'ఖడ్గసృష్టి' శ్రీశ్రీ కవితాహేమంతమని అనుకోవచ్చు. ఆకులు ముదరబారినా, పచ్చన పసిమిగామారినా, చేవగల చెట్టు కాబట్టి తొల్లిటి దార్ఢ్యమూ సారమూ వైదొలగక, పూవుల కంటె ఆకు కంటె ఫలరాశి ఎక్కువగా దర్శనమిస్తున్నది. ఇది క్షయమనుకుంటే ఎట్లా? చెట్టుకు గల పర్యవసానం ఫలమే అయినప్పుడు, ఇది అభిలషణీయమైన పరిణామమే అనుకోవాలి. కాకుంటే, కొన్ని గేయాలు "దారం కంటె తేలికైనవి" (శరచ్చంద్రిక). మాటలు తేలికై మాటల వెనకగల చింతనం చిక్కనైంది. తత్వప్రకర్ష అధికమైంది. ఇది వయస్సుతెచ్చిన మనస్సు మార్పు.

మేధస్సుకు పనిబెట్టేంత కంటె చాల హెచ్చుగా హృదయానికి శ్రీశ్రీ పని బెడుతాడని ఇంత వరకు బహుజనాభిప్రాయమై ఉంది. అంటే, శ్రీశ్రీ Cerebral Poet కాదని ఒక అభిప్రాయం వ్యాప్తిలో ఉంది. ఇదికొంతవరకే నిజమని 'ఖడ్గసృష్టి' లో శ్రీశ్రీ నిరూపించుకొన్నాడు. ఇందులో కవిత్వాంశ తక్కువని వేలెత్తి చూపే

వాళ్ళుంటారు. కవిత్వమంటే ఏమిటో విమర్శకుని కంటె కవే సాధికారంగా చెప్ప గలడు. పైగా రాజకీయ విషయబాహుళ్యం కొందరికి కంటకప్రాయమైంది. వీటన్నిటికీ ఒక్కటే సమాధానం.[1]

కవితామయం కానిది ఏదీలేదని ముప్పైఏళ్ళ కిందట శ్రీశ్రీయే "ఋక్కులు"లో చెప్పాడు. ప్రతిభావంతుడు దేనినైనా తన స్పర్శతో కవిత్వంగా మార్చగలడు. కావలసింది ప్రతిభ. కవిత్వానికి ఇదీ అదీ అని విడిగా కొన్ని నిర్ణీత విషయాలులేవు. కవిత్వ స్వరూపంకూడా శిలా శాశ్వతం కాదు. అలంకారాలు, చమత్కారాలు, వ్యంగ్యం, ధ్వని– ఇవి ఉంటేనే కవిత్వం, కాకుంటే కాదు, అని ఏ శాసనాన్నీ, నవీన కవులు తలదాల్చరు. నవ్య కవులే ఆ శాసనాలను ఉల్లంఘించారు. అయితే మన కళ్ళూ చెవులూ ఒకవిధమైన కావ్య స్వరూపానికి మచ్చికబడి ఉండబట్టి, మనకు బాగాపరిచయమయినదే కవిత్వమనిన్నీ, కొత్తది కవిత్వం కాదనిన్నీ అనుకొంటూ, కవిత్వాన్ని మెచ్చగల మన సహానుభూతినీ మనమే కుంచించుకుంటున్నాము. "న.... న.... న.... నత్తిమాటల"లోకూడ కవిత్వం ఉండవచ్చని శ్రీశ్రీయే వెనకెప్పుడో రాశాడు. కవి హృదయంలోని రాగాలాపన ఎట్టితీగలు సాగితే అలారాసుకొంటూ పోవాలని "పిడేలు రాగాలు డజను"కు రాసిన 'intro' లో వివరించి ఉన్నాడు. కాబట్టి ఇప్పుడు రూళ్ళకర్రకు దారంకట్టి లాగుతూవస్తున్న పందికొక్కులాంటి పొడుం డొక్కులను అసహ్యించుకొంటున్నాడంటేనూ ('మహాకవి ఆశ్చర్యం'), "భాషకు లొంగని భావశాఖలో / చోద్యము లూహలో మలుపు చూడ్కులు" సహించని ఉద్యమ నాయకుణ్ణి హేళన చేస్తుంటేనూ ('అధివాస్తవికుల ప్రవేశం') ఆశ్చర్యపడవలసిన పనిలేదు. గద్యాన్ని పద్యానికిచ్చి ఎన్నడనగానో పెళ్ళిచేశాడు. ఆవేగాన్నే వేగంగా చేసుకొని, యదార్థాన్ని తురుపుగా మార్చుకొని, "వికృతం ఖంతాయమానంగా కనబడి తేనేం / ఒకానొక ఋజుత్వం సాధిస్తా"మని ఎన్నో ప్రయోగాలు చేశాడు. ("ఆఖరి మాట మొదటిమాట") ఇవన్నీ "సహృదయుల" మదికెక్కాయా లేదా అన్నది వేరే విషయం. అలా ఎక్కించుకోవడమే "సహృదయత్వ"మని గుర్తెరిగే "సహృదయులు" కరవైతే, కవి ఏంచేస్తాడుగనుక?

Hungry Thirtiesలో గొంతుముడివిప్పి, ఆధునిక నాగరికతను, యంత్రాలను,

---

1 ప్రఖ్యాత అమెరికన్ కవి కార్ల్ శాండ్‌బర్గ్ ఇలా అంటున్నాడు: "A poet explains for us what for him is poetry by what he presents to us in his poems." Notes for a preface: Harvest Poems: carl sand-burg.

విజ్ఞాన శాస్త్రాన్ని, భౌతిక వాదాన్ని కార్మికోద్యమాన్ని కవిత్వంలోకి తీసుకొనివచ్చి భారత దేశపు ఇరవయ్యవ శతాబ్దానికి ప్రథమ ప్రభాతారుణ రేఖలలో ఒకడయ్యాడు శ్రీశ్రీ. భావ కవిత్వపు సరీసృపాలకంటె ముందు, మృతకృత యుగావశేషాలను వదిలించుకోక తప్పలేదు. నన్నయభట్టు వేషం వేసుకొచ్చిన విశ్వనాథ సత్యనారాయణ గారిముందు తన "మాటల మూట"ను విప్పకుండానే, "కలంలో కళకలం" బయల్పడకుండానే, రాజీచేసుకోకుండానే, వేరేదారి తొక్కాడు. నాటినుంచి నేటివరకు (పోనీ, నిన్న మొన్నటివరకే అనీ ఒప్పుకుంటాను) అతని మనస్సు ప్రయోగశాలగా మారింది. తెలుగు చదువరిని నిజంగా ప్రపంచానికి పరిచయం చెయ్యాలనే సత్సంకల్పమే గాని, ఇది పూర్తిగా "శాఖాచంక్రమణం" కాదు. కన్నభూమిలో వేళ్ళుతన్నుకొని అనంతాకాశంలో జుత్తువిప్పుకొన్న మహా వటవృక్షం కాబట్టే, విదేశీభావ ప్రవాహాలకు కాళ్ళు నిలదొక్కుకొని, వాటిని రాబిలుచుకొని, తాను కదలబారి ఇతరులను కదలించబూనాడు. ఈ ఇంటికి అన్నీ గవాక్షాలే. అడ్డుగోడలు లేవు. అయినా ఇది ఇక్కడి ఇప్పటి ఇల్లు. కాదనగలరా? ఆంధ్ర దేశం కోసం ఎంత తాపత్రయ పడుతున్నాడో విశాల భారతం, ఆసియా, ఆఫ్రికా, అమెరికా—మొత్తం ప్రపంచం కోసం అంత ఆరాటపడుతున్నాడు. పాల్ ఎల్వార్డ్‌ను ఫ్రాన్సునుండి, డిలాన్ థామస్‌ను ఇంగ్లాండునుండి, పుష్కిన్‌ను రష్యానుండి, మనకోసం తెస్తున్నాడు. తెలుగువాణ్ణి నాగరికుణ్ణి చేద్దామనుకుంటున్నాడు. అయితే అలా కావడానికి మనం సిద్ధంగాలేమని, తన ప్రయోగాలను మనం గిరాటు కొట్టివేశామని, 1959 లోనే గమనించాడు.[2]

II

"ఖడ్గసృష్టి" ఒక సంకలనం. దానిలోని రచనలు అన్నీ ఒక కోవకు చెందవు. సొంత రచనలు, అనువాదాలు అని రెండు భాగాలుగా చెప్పుకోవచ్చుగాని, దానివల్ల పాఠకునికి ఆట్టేలాభించదు. ఎడిటింగ్ సరిగా జరగలేదేమో. తేదీలు ఇవ్వకపోవడం వాంటి అంశాలేగాకుండా, ఒకే అఖండ గేయపు రెండు భాగాలను ఒక్కచోట గాక రెండు చోట్ల ముద్రించడమూ, ఒక కూటమికి చెందిన గేయాలన్నిటినీ వెంబడి వెంబడి ముద్రించక పోవడమూ, జరిగాయి. కాబట్టి పాఠకుని సౌకర్యార్థమని నేను

---

2 పురిపండా అప్పలస్వామిగారి ఇంగ్లీషు పద్యాల సంపుటి 'సౌదామిని'కి ఇంగ్లీషులో ఉపోద్ఘాతం రాస్తూ, శ్రీశ్రీ ఇలా అన్నాడు:-

"Progressive thought looks on surrealism with suspicion. Orthodox rightist criticism is shocked and scandalized by the surrealist excesses. All the same I think that surrealism has not been given a fair chance in our country."

ఈ ఖండికలను వర్గీకరించాను. రాష్ట్రోద్యమం, దేశరాజకీయం, అంతర్జాతీయం, తాత్వికం, సత్క్రియలిస్టు ముద్రాంకితం, అనువాదం—అని ఆరు అంశాలు కొట్టవచ్చినట్లు కానవచ్చే సంకీర్ణ సంకలనం ఇది.

ఒక్కొక్కదాన్ని గురించీ చెప్పుకొనిపోదామంటే ఇప్పటికే గ్రంథం పెరిగింది. వాటిని స్థూలంగానైనా స్పృశించకపోతే ఎట్లా?

ఆంధ్ర రాష్ట్రోద్యమంగురించి, రాష్ట్రప్రాప్తి తర్వాత ఘటనలగురించి కొన్ని గేయాలున్నాయి. అలాగే భారతదేశ రాజకీయ పరిణామాల గురించి మరికొన్ని. అసలు రాజకీయాలకూ కవిత్వానికీ ముడిపెట్టడమేనా అనేవాళ్ళు ఇప్పటికీ కొందరున్నారు. జాతి జీవితంతోటి పెనవేసుకు పోయిన కవికి రాజకీయం బాహ్యమేమీకాదు. దంత ప్రాకారం లోని వాడికే అది అశుద్ధంగాని 'అలజడి మాజీవితం, ఆందోళన మావూపిరి' అనుకొనే కవికి అదిపరమాన్నమే. అందులో కవిత్వగుణం ఉండాలేగాని ఏది కవిత్వంకాదు? నిజానికి, జాతితోటి ఈ బంధం ఇతోధిక బలీయంకావాలి. గత రాజకీయమయిన చరిత్రను గురించి రాస్తే కవిత్వమైనది, భవిష్యచరిత్ర అయిన నేటి రాజకీయాన్ని గురించి రాస్తేనే కవిత్వం ఎలాకాకుండా పోతుంది? అలాఅయితే రుడ్యార్డ్ కిప్లింగ్ కవేకాడు, వాల్ట్ విట్మన్ కవి కాడు, మయాకోవస్కీ కవి కాడు, ఎవూషెంకో వోజ్నెసెన్స్కీ కవులుకారు, శాండ్‌బర్గ్ కవికాడు. మిగిలిన కవులు కోకిలాలాపాలగురించీ ప్రణయ మహత్వంగురించీ నూట పదకొండోసారి ఊకదంచుకుంటూ ఉండవచ్చు. ఉగాది అనుబంధాలూ, దీపావళి సంచికలూ, వాటితోపాటు తమ చిల్లిజేబులూ నింపుకొంటూ ఉండవచ్చు. కవిధర్మం గురించే ఈ వివాదం. కవి జాతి ముఖద్వారమా కాదా? కవి లోకప్రతినిధా కాదా? ఇది తెగనిచర్చ.[3]

తేలిక మాటల్లో వ్యావహారిక ధోరణిలో రాయడమే తక్కువ తరగతి కవిత్వం కిందికి వచ్చేట్లుంటే, శ్రీశ్రీ రాసిన 'విషాదాంధ్ర', 'గాంధీజీ', 'మహాసంకల్పం' వంటివి తక్కువ తరగతికివస్తాయి. నోటి మాటకూ చేతిరాతకూ మధ్యగల అగడ్త పూడి

3. "There are poets of the cloister and the Quiet corner, of green fields and the earth serene in its changes. There are poets of streets and struggles, of dust and combat... "poetry and politics, the relation of the poets to society to democracy, to dictatorships–we have here a theme whose classic is yet to be written."—carl Sandburg.

పోవడమే అన్నిదేశాల కవిత్వంలోనూ కానవస్తున్న సాధారణ పరిణామమని హర్షిం చేటట్లయితే, ఈ మూడు ఖండికలు-ముఖ్యంగా 'మహా సంకల్పం'-అగ్రశ్రేణిలోనే అగ్ర స్థానంలో నిల్చోగలవు. జాతి జీవితంలోని ఏ పెనుకదలికకు స్పందించే కవి గుండె నిజంగా అసూయపడదగిన గుండె. ఎందుకంటే, అది బండబారి దళుపెక్కి మొద్దు బడలేదు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి లగాయతు తుమ్మల సీతారామమూర్తి చౌదరి వరకు ఆంధ్ర గానం చేశారు. ప్రకాశం మంత్రివర్గం ఈనాముదారీ నిర్మూలన కొరకు చట్టాన్ని తేబోతున్నదని చెళ్ళపిళ్ళవారు దానిని శపించారుకూడాను. రోజు వారీ రాజకీయాలంటే ముప్పై నలభై ఏళ్ళు రాష్ట్రంకోసం, అరవై డెబ్బయ్యేళ్ళు రాజకీయ స్వాధీనతకోసం మూడుకోట్లమంది, నలభైకోట్లమంది చేసిన పూనికలు రోజువారీవా? గర్వించదగిన దానినిగురించి అవమాన పడమంటున్నారు కవిని విమర్శకులు.

ఆ మూడింటిలో ఏ ఒక్కదానిని తీసుకొనిచూసినా అది అనర్ఘ రత్నమని చెప్ప వచ్చుననుకుంటాను. ఈనాటి నీతి కథలాగున్న 'విషాదాంధ్ర', ఆర్షప్రోక్త మనిపించే 'గాంధీజీ', మహాప్రవక్తృవచోధారగా గుండెలను తాకివేసే 'మహాసంకల్పం'—శ్రీ శ్రీ గారి 'మహాప్రస్థానం' లోని ఏ ఖండికకూ తీసిపోవు. మహా ప్రస్థానానికి మరొక స్పందనే 'ఖడ్గసృష్టి'. శ్రీ వెంకటేశ్వరరావు గారికి బాగా బాధకలిగించిన శ్రీ శ్రీగారి ఖండిక "మున్నుడి" అనేది. ఇది గొప్పఖండిక అని నేనూ అనను. అయితే కవి హృదయాన్ని దర్శించదలచుకొన్న వానికి, కవి కెన్నడీ వ్యతిరేకిగాక సామ్రాజ్యవాద వ్యతిరేకి అని తెల్లమౌతుంది. కెన్నడీ 'లిటిల్ లింకన్' కాబట్టి కెన్నడీని తప్పెన్న గూడదట! 'లిటిల్ లింకన్' అయితే క్యూబామీదికి Bay of pigs దండయాత్ర? కాంగోలో రక్తపాతం? లావోస్‌లో జోక్యం? దేశీయంగా కెన్నెడీ అభ్యుదయకామి కావచ్చునేమో, అంతర్జాతీయంగా కూడా తనకు బాగా మచ్చికైపోయిన కృశ్చెవ్ తోటి భాయి భాయి అని వుండవచ్చునేమో, ఇవ్వన్నీ ఏమిటి? ప్రెసిడెంట్ ఐసెన్ హోవర్ పదవీ విరమణ సందర్భంలో దేశానికిచ్చిన వీడ్కోలుసందేశం, అమెరికన్ రాజకీయాలపై ఒక సైనిక—పారిశ్రామికకూటమి(Military–industrial complex) యొక్క పిడికిలి బిగుసుకొంటున్నదని చెప్పలేదా? ఈ విషయాలన్నీ కవి మనస్సులో ఉన్నాయి. ధనిక వాదానికీ, సామ్రాజ్యవాదానికి ఒక చిహ్నంగా కెన్నెడీని శపించాడు.

ఈ రాజకీయ విషయాలను కావ్యవస్తువులుగా చేసుకొనికూడా శ్రీ శ్రీ కవిగా చెప్పేదేమిటి? "మానవుడే నా సంగీతం మనుష్యుడే నా సందేశం!" ('మహాసంకల్పం') అని ఎవరైనా అనవచ్చు. అయితే, దానికి ఒకతాహతు కావాలి. ముప్పైఏళ్ళుగా అన్నార్తులకూ అశ్రుపూర్ణులకూ శ్రీ శ్రీ కవిత్వం ఒక ఊరట కల్పించి, నడిపిస్తున్నది.

ఉద్యమాలకు నినాదప్రాయమౌతున్నది. శ్రీశ్రీ ఒక సంస్థా ప్రతికల్పుడౌతున్నాడు. భవిష్యదుజ్జ్వల స్వర్ణయుగానికి చూపులను లగించి, అసమానతను కాదని అసహాయతను తోసిరాజని వ్యక్తి సమూహమే శక్తికి మాతృస్థానమని అంటూవచ్చాడు కనుకనే, రాజకీయ వేత్తల నుద్దేశించి

"అర్ధ నగ్నంగా ఆకాశాన్నే కప్పుకొని
నిండని కడుపుతో మండుతున్న కళ్ళతో"

కనిపిస్తున్న సామాన్య మానవునికి "అతికించండి మళ్ళీ అతని ముఖానికి నవ్వు" అని ఆజ్ఞాపించగలుగుతున్నాడు. షెల్లీ అన్నట్లు unacknowledged legislator కాగలుగుతున్నాడు. సామాన్య మానవుడి కోసమే ఆంధ్ర రాష్ట్రం అయితే, దేశంలో ప్రజలు సుఖించి సన్మార్గ వర్తనులైనప్పుడు "దేవతలా మానవులే దీవించాలి/దేశంలో దేవత్వం దీపించాలి" అని ఆకాంక్షిస్తున్నాడు. ఇవి చిటి పొటి ముద్దు ముద్దు వూహలు కావు. వ్యూహాలు పన్నుకొన్న వూహలు. ఇది "రణద్రణ నిస్సహాణ ప్రణవం/అది నా హృదయంలో రుధిరజ్వలనం గీతా జననం" ('భ్రమర గీత'). ఆచరణకు దారితీసే ఆవేశం, ఆశయాల సంఘర్షణలో ప్రజాపక్షాన్ని బలపరిచే కావ్యాయుధం—ఇవి శ్రీశ్రీ మార్క్సు వస్తువులు. అందుకే ఖడ్గసృష్టి చేస్తున్నానని తానుగా చెప్పాడు. తాను సమాజ వాది. వ్యక్తి వికాసం సుసంపుష్టమైన సమాజంలోనే సుసాధ్యమౌతుంది గాని, Every man for himself and Devil take the hindmost అనే విశృంఖల వ్యక్తి వాదపువలయంలో అసాధ్యమని నమ్మేవాడు. కనుకనే ఇలాంటి గేయాలన్నిటా, సమాజం అధికాధికంగా ప్రసక్తమౌతున్నది. 'ఒంటరితనం, తుంటరితనం' అపుతున్నది. వ్యక్తి నిజంగా ఎప్పుడు సమున్నతుడంటే, తన సమాజపు లక్షణాలన్నిటినీ తాను మూర్తీభవించినప్పుడే గాని, వేర్పడి దుర్బలుడై సాదాతనం పేరిట నీరసం వాత బడినప్పుడు కాదు. అందుకే 'మహా సంకల్పం'లోని దీనుడైన వ్యక్తి, జన సందోహానికి ప్రతినిధి. అందరూ అతనిలో ఉన్నట్లే, అందరిలో అతను ఉన్నాడు. సమాజాన్ని శ్రీశ్రీ దర్శించిన క్రమం ఇది.

"నిటారుగా నిలబడు నేస్తం/హుటా హుటిగా ముందుకి సాగు" అన్నప్పుడూ, "మానవుడిగా మేలుకో నేస్తం" అన్నప్పుడూ, శ్రీశ్రీ ఎవరిని ఉద్దేశిస్తున్నాడు? అభో జగత్సహోదరులనందరినీ అనుకోవాలి. "సామూహిక స్వాతంత్ర్యం" కావాలన్నప్పుడూ, "క్షేమం అవిభాజ్య"మన్నప్పుడూ దేనిని ఆకాంక్షిస్తున్నట్టు? వట్టి

ఆర్థిక సమానత్వమే కాదు, మనస్సును మరొక్క మంచి మనస్సుతోటి అనుసంధించే సౌభ్రాతృబంధమూ, హార్దికానుబంధమున్నూ.

"మాట చేతగామారి
మనిషి మనిషితో చేరి
స్వప్నం సత్యం ఐతేనే
స్వర్గం" ('ఎఏఐ ఒఓఔ')

శీర్షికకూడా సరిగానే కుదిరింది. 'అఆఇఈ' లంటే మరీ బాగుండేది. తానుద్దేశించిన వారికి గుణితంకూడా నేర్పాలి. వారికి సమిష్టి సూత్రమనే సరైన విధానాన్ని ఒంట బట్టించాలి. "పరమార్థం సామాజిక / సామూహిక సద్వర్తన." అయితే వ్యక్తి వైవిధ్యానికి తావేలేదా? ఉందిగాని అది వైరుధ్యాలకు తావియ్యని ఐక్యత! "అనేకం అయితే ఏకం/అదే వివేకం" అనే శ్రీశ్రీ జీవన సూత్రానికిన్నీ "పెక్కులొకటిగ జూచువాడే ప్రాజ్ఞుడన వినమే?" అనే గురజాడ దానికిన్నీ చాలా దగ్గరి చుట్టరికమే.

మరి స్వర్గమనే ఈ మాట దేవలోకాన్ని ప్రతిపాదిస్తుంది కదా, భౌతికవాది అనుకొంటున్న శ్రీశ్రీ ఆధ్యాత్మికవాది ఎప్పుడైనాడు? శ్రీశ్రీ నిరీశ్వరవాది అని నేననుకోను. చిన్న తనంలో మంచి భక్తిపరుడేనని విన్నాను గాని ఇప్పుడు సంశయ వాదిగా (agnostic) ఉంటున్నాడనిపిస్తుంది. "శరచ్చంద్రిక"లోనూ, "సద సత్సంశయం"లోనూ ఈ ఊహకు ఆధారాలు దొరుకుతాయి. జనన మరణ చంక్ర మణం కవికి ఆశ్చర్యంకొలిపి అయోమయమనిపించడమే కాదు, మరణానంతర జీవితంగురించి, అనాగతాన్ని గురించి ప్రశ్నలుదయిస్తున్నాయి. సృష్టికి అర్థం ఏమిటి సృష్టికర్త ఉన్నట్టా లేనట్టా? ఇవి "తెగని సమస్య"లు. అయితే వీటికి జవాబులు చెప్ప బూనినవారిని చాలమందిని శ్రీశ్రీ సాంఘిక దృక్కోణం నుంచీ, వైయక్తిక మానసిక దృక్కోణంనుంచీ, నిరాకరించి తిరస్కరిస్తున్నారు. వారిలో అనేకులు 'వృద్ధనారీ పతి వ్రతా' కోవలోని వారు-"రిటైరైన పోలీసులు", వేమన మాటల్లో కామిఅయిన తర్వాత మోక్షకామి అయిన వానిలాంటి వారు. కొందరు బతుకంటె భయపడి తమ నీడకు తాము వెరచి తమ వెనుక తాము దాక్కొన్నవారు. జీవితాన్ని రెండు చేతులా నిలుపు కొని అనుభవించే వారు, శాపతుల్యమని తలపోసే "ఫిలోఫర్లు" (ఫిలాసఫర్ + లోఫర్ = ఫిలోఫర్). బానిస మానసికతతోటి మానుషప్రయత్నాన్ని దిగజార్చి సకలా తీతమైన శక్తికిలోబడచేవారు మరి కొందరు.

అస్తి నాస్తి విచికిత్సకు/లంతమంది యేచున్నా
ఇది మాత్రం నేనెరుగుదు/తథ్యం ప్రాణికి మృత్యువు
తప్పదు జీవికి వేదన." ('సదసత్సంశయం')

ఇది శ్రీశ్రీ తేల్చిన నిగ్గు. దీనికి, బౌద్ధ మత ప్రవర్తకుడైన గౌతమ బుద్ధుడు చెప్పాడంటున్న I teach sorrow and the elimination of sorrow అనే మాటలకు చెప్పుకోదగ్గ తేడా ఉన్నదనిపించదు.

వ్యవస్థగామారిన మతభావన, దానితరఫున ప్రవక్తలైనవారు రాచరికపు రోజుల అసమ సమాజాన పాలక వర్గాధిక్యం నిలబెట్టే సంకల్పంతో మనుష్య ప్రయత్నాన్ని తగ్గించారని శ్రీశ్రీ అంటున్నాడు. ఇది సాంఘికమైన విమర్శ. మరొకచోట ఒక వ్యాసంలో శ్రీశ్రీయే దీనిని మరింత సమగ్రం చేశాడు. ఈసారి మనస్తత్వశాస్త్ర కోణం నుంచి, అందులోనూ స్వప్న తత్వంనుండి[4]. ఏ దృక్కోణం నుంచి చూసిన ఇది మార్క్సియన్ భౌతిక వాదమిచ్చే వివరణకు చాలా చేరువగా వచ్చి నిలుస్తున్నది. ఈ ఫోటో గ్రాఫిక్ సంకేతం చూద్దాం:

"స్వర్గం నరకం అన్నవి ఒకస్థితికే రెండు పేర్లు
ఫోకస్ భేదం అంతే లోకస్ రెండిటి కొకటే."

స్వర్గనరకాలు మనిషిలోనే భూమి మీదనే ఉన్నాయి. కాబట్టి నరకం ఏర్పడగల అవకాశాలను ఎదుర్కొంటూ, స్వర్గమేర్పడగల అవకాశాలను హెచ్చించుకొంటూ మనిషి మనుష్యలోకాన్ని మార్చుకోవచ్చు. ఈ మార్పుకు 'సైన్స్' ఒక సాధన మౌతుంది. 'అన్నీ ఒకడికి బదులు/అంత మందికీ అన్నీ!/అదే స్వర్గ మంటాను' ('సామాన్యుని కామన'). తనలోని అసుర, పాశవ గుణాలనతకరించుకొని, దైవ, మానవ గుణాలను పెంపొందించుకొంటే, మానవుడే దేవతుల్యుడు కాడామరి?

---

4. "మనోహర స్వప్నాలు కనడం మానలేని మానవుడు తానుకన్న ప్రతికలకీ ఏదో ఒక ఆకారం ఇస్తాడు. మానవుని కల ధరించే ఆకారమే కళ. అతని అంతిమ స్వప్నమే భగవంతుడు. కాని ప్రతీ స్వప్నానికీ కాళ్ళు నేలమీదనే ఉంటాయి. భగవంతుడనే స్వప్నానికి మానవుడే ప్రాతిపదిక. దేవుడు మనుష్యుణ్ని నిర్మించాడనడానికిబదులు మనుష్యుడే దేవుణ్ణి సృష్టించుకున్నాడనడం సమంజసం.... మానవుని ఆశలు స్వర్గాన్ని కల్పిస్తాయి. భయాలు నరకాన్ని...."
—చిత్రకవిత్వం: శ్రీశ్రీ: అభ్యుదయ, ఏప్రెల్ 1957

ఆ దారిలోనే ఉన్నాడు మానవుడంటున్నాడు 'శరచ్చంద్రిక'లో శ్రీశ్రీ. మానవజాతి బాల్యాన్ని వదిలివేయలేదనే గాని ఇప్పటికే ఎంతో అభివృద్ధిని చేసి చూపింది. ప్రకృతిపై అదుపు అధికాధికమౌతున్నది. అణురహస్యాలు, రోదసీ మర్మాలు, వ్యాధుల కీలకాలు, ప్రాణం స్వభావం, శాంతికాముకత — ఇవన్నీ ధనపక్ష మనుకోవచ్చు. ఋణ పక్షంకూడా లేకపోలేదు; దారిద్ర్యం, భయం, గతానుగతి కత్వం వగైరాలు. అయితే ముందున్నవే మంచి రోజులు. అందుకే కవికి 'భవిష్యత్తుపై నిఘా'! ఇది వెర్రి ఆశావాదమేం కాదు, మంచి గుణవర్ధనం మీద లేచిన చారిత్రక వాస్తుశిల్పం.

"రేపు మానవుడు మానవునిలోని మానవత్వం గుర్తించి
మాననీయములైన సరికొత్త మర్యాదలు సృష్టించే మహత్తర కాలం
రేపు మేలుకొన్న ప్రజలు శిరస్సున ధరించి ఆదరించే అతినవీన కవితా మాధుర్యం"
('ఒకటీ—పదీ')

ఇప్పటినుంచే పూనిక మొదలు కావాలి. ఇప్పటికప్పుడే ఆ కదలిక మొదలైందని 'గాంధీజీ'లో శ్రీశ్రీ చెబుతున్నాడు. "ప్రపంచ యోని ద్వారం" భారత దేశమంటే విమర్శకులు ఉలికి పడడమెందుకు? "యోని" శబ్దమే పరిహార్యమనా? తెలుగు "వాడి"కి అంకిత మిస్తున్నానంటేనే "సాధు సాధు" అని చెవులు మూసుకునే మర్యాదస్తులు "యోని"తో గాభరాపడుతున్నారు. ఒకప్పు డెప్పుడో ఈ దేశం ప్రపంచానికి సంస్కృతీ స్తన్యంచేపి మాతృస్థానమైందని ధ్వని కాదా? లేక, ఈ కాలంలో పీడిత ప్రపంచానికి తేజోపథం చూపెట్టి విశేష గౌరవాన్ని ఆర్జించుకొన్నదని అనుకోరాదా? 'యోని' 'అయోనిజ'లో లేదా? అది సరేగాని, అంతకుముందు చరణం లోనే "అవనీమాత పూర్ణగర్భంలా" ఆసియా ఖండము ఉప్పొంగిందన్న కవి, గర్భం నుండి అంత కిందికి పడిపోతాడా?

"ప్రపంచాన్ని పీడించిన పాడు కలని/ప్రభాత నీరజాతంలో వెదకకు
ఉత్పాతం వెనుకంజ వేసింది/ఉత్సాహం ఉత్సవం నేడు".

గాంధీజీద్వారా ధార్మిక శక్తి యొక్క ఘన విజయాన్ని పురస్కరించుకొని, గాలిచేత మళ్ళీ జాలిగా నిశ్వసింపచేసి, బాంబుల దంబులనుండి తప్పించుకొన్న మానవాళితో పాటు గడ్డిపువ్వులనుకూడా నవ్వింప జేసిన కవి,

"ద్వేషం ఇచ్చే పర్సెంటేజి
ప్రేమం ఎలా ఇవ్వగలదు?" ('శరచ్చంద్రిక')

అని అడగడం సహజమే. ఇవ్వలేదు నిజమే. అయితే ఉన్న ద్వేషాలను మరచిపోతే ప్రపంచ యథార్థాన్ని తృణీకరించినవాడై అబద్ధీకుడౌతాడు. అందుచేతనే మరి కొంతకాలానికైనా శ్రీశ్రీ వాస్తవాన్ని గుర్తించవలసి వచ్చింది. 'ఖడ్గసృష్టి' పేరిటి ఖండికచూస్తే ఈ అంశం తెలుస్తుంది. "గాంధీజీ" నిజంగా చనిపోయింది. గాడ్సే చేతిలో కాదు, కాంగ్రెసు వాముల చేతిలోనే! లేక ఈ హింసలు, ఈ దుష్పరిపాలనం ఈ దారిద్ర్యం, ఈ అక్రమాలు—ఇవన్నీ ఏమిటి? అహింస ఆశయంగా మంచిదే అది ఆయుధంగా లాభం లేదంటూ, "క్షణం క్షణం మారుతున్న లోకాన్ని/సరీగా అర్థం చేసుకున్న వాళ్ళంతా/పేద ప్రజల పక్షం వహించడమే/ పెద్ద అపరాధమైపోయింది" అన్నాడు. దీనితో మిగతవారికేమోగాని, నాకు మాత్రం విప్రతిపత్తి లేదు. నడి రోడ్డున నిల్చుని "దారికి హక్కుదారు తానే అయినట్టు," నాగరికతకు ఎంతో వెనుక బడి, స్వకాలానికి స్వజానానికి గల తన బాధ్యతలను తుంగలో తొక్కి, "యంత్ర విరోధి అహింసావాది శాకాహారి/మద్యనిషేధ ప్రజ్ఞాశాలి" నంటూ నిలబడ్డ ఎద్దు మార్కు రాజ్యమే 'నగరంలో వృషభం'గా దర్శన మిస్తున్నది. స్వాతంత్ర్యావ తరణ సమయాన చెప్పుకున్న సంకల్పం గుర్తుకు వస్తే, ఏ కవి గుండె ఘూర్ణిల్లదు?

"స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు
చాలా వాడైనకత్తి, విలువైన వజ్రం." (మహాసంకల్పం)

అదే ఇప్పుడు ప్రశ్నార్థక సంజ్ఞలోనై, ఆస్తి నాస్తి సందేహాన పడినప్పుడు, దేశక్షేమం ప్రజాసౌఖ్యం పరమార్థమనుకొనే ఏ కవి అలీనుడై ఉండగలడు? అలా ఉండక పోవడం శ్రీశ్రీ అపరాధం కాదు, అలా ఉండాలనడం శ్రీశ్రీకి అపరాధం! రాజకీయం కాదిది, జాతి ఉండడమో ఊడడమోవంటి పరమ సమస్య. మానవ వాదం కన్నీళ్ళు రాల్చడంతో సరిపెట్టుకోకుండా కత్తిని చేపట్టడంతో సార్థకమౌతుంది. 'అధర్మ నిధనం' కోసమే ఖడ్గం!

"ఇప్పుడు దూసిన ఖడ్గం/ఇంతట్లో కౌగలింత
ఒక నేత్రం కల్హారం/మరోకన్ను కర్పూరం" ('సామాన్యుని కామన')

సామాన్య మానవునికి తోడు, అంతకంటె ఎక్కువగా, మానవవాది ననుకునే కవికి అవశ్యం ఉంటాయి; లేకుంటే ఉండాలి.

## III

'మహాప్రస్థానం'సరే, ఎవడైనా ఈ నాడు మహాకావ్యమంటున్నాడు. 'ఖడ్గసృష్టి'లో కొన్ని ఖండికలను కూడా అయిష్టంగానైనా ఖజాన వేసుకొనే నాబోటి గాడు మరొక్కడైనా కనిపించకపోడు. మిగత ఖండికలో? అనువాదాలను అటు ఉంచుదాం. సర్రియలిజం అనే వెర్రిలోపడిన రోజుల్లో చేసిన రచనలుగాని, చిత్ర కవిత్వం పద్ధతులను తలకెక్కించు కొందామని చేసిన రచనలుగాని, దాదాపు ఇనుప గుగ్గిళ్ళైనని చెప్పక తప్పదు. అయితే వాటిని తోసివెయ్యడమేనా! అది సరికాదను కొంటాను. మార్క్సియన్ దృక్పథానికీ ఫ్రాయిడీయన్ దృక్పధానికి చుక్కెదురు అయినా, సర్రియలిస్టు కవిత్వంలోకూడా పూర్తిగా 'ఆటోమేటిసిజం' ఉన్నదని, అది అగమ్య గోచరమని, అర్థాన్ని పలుపువిప్పి వదిలేసిన అధ్వాన్నపు అడివి అని, నేననుకోను. గొప్ప కవులెందరో ఈ ప్రక్రియను చేబట్టారు. కవిత్వం, చిత్ర లేఖనం వగైరా కళలను ఇది కొన్నాళ్ళు పాలించింది. దానిలోనూ సుగుణమేదో ఉండాలి.

బూర్జువా వర్గపు అంతిమ ప్రతినిధులు అరాచక మార్గావలంబులైతే కావచ్చు గాక, ఫ్రాన్సులో అరగోఁ గానీ, ఇక్కడ శ్రీశ్రీ గానీ అలా చివరివరకూ ఉండిపోలేదు. సర్రియలిస్టు కవిత్వంరాసి అభ్యుదయ కవిత్వానికి అరగోఁ ప్రయాణిస్తే, అభ్యుదయ కవిత్వం రాసి సర్రియలిస్టు కవిత్వానికి శ్రీశ్రీ ప్రయాణించాడు. ఇద్దరూ కొంత కాలమే సర్రియలిస్టులైనా, తదనంతర కాలాన వారు రాసిన అభ్యుదయ కవిత్వం సర్రియలిస్టు పద్ధతివల్ల సంపన్నమైనదేగాని ఎక్కువగా నష్టపోలేదు. తెలుగు దేశంలో శ్రీశ్రీకి నారాయణబాబు నన్నయకు నారాయణభట్టు అయినాడు. సర్రియలిస్టు పద్ధతిలో శ్రీశ్రీని తలదన్నేట్లుగా రాశాడు. అందుచేతనే శ్రీశ్రీగారి సర్రియలిస్టు రచనలు కాస్తోకూస్తో బోధపడవచ్చునేమో గాని నారాయణ బాబుగారివి కొరకరాని కొయ్యలే.[5] దీనికి ఒక కారణం ఉంది. శ్రీశ్రీ ముఖ్యంగా వాస్తవాది కావడమే కాదు. సర్రియలిజం కూడా ఏదో ఒక రూపంలో వాస్తవాన్ని ప్రతిబింబించక పోదు. "అధి వాస్తవికులు ఉన్మాదులుకారు", "అధి వాస్తవికతలో వాస్తవికత గర్భితమై వుంటుంది" అని శ్రీశ్రీయే నవంబరు 1945 'తెలుగు తల్లి' సంచికలో ఒక వ్యాసం రాశాడు.

---

5. "శ్రీశ్రీ స్థూలదృష్టికికూడా దొరుకుతాడు. నారాయణబాబు కొన్ని తావులలో సూక్ష్మదృష్టికి వినా, స్పష్టంకాడు"—'రుధిరజ్యోతి'— ఒక ప్రస్తావన: రోణంకి అప్పలస్వామి: భారతి: సెప్టెంబరు 1952.

ఈ సంకలనంలో కొన్ని అలాంటి రచనలున్నాయి. తెలుగులో తొట్టతొలిటి అధివాస్తవిక రచనగా 'మాటల మూట'ను పేర్కొంటున్నారు. మనస్సంచారంలోని అసంలక్ష్య క్రమాన్ని పైకి తేవడమే అధి వాస్తవికత అంటున్నారు.

'మాటల మూట'నే తీసుకుందాం! కుక్కను వెంటబెట్టుకొని, మాటల మూటను భుజాన పెట్టుకొని పోతున్న కవిని ఒక చెట్టు శాఖాహస్త సంజ్ఞతో ఆపింది. తర్వాత విశ్వనాథ సత్యనారాయణగారి వేషం ధరించిన నన్నయ భట్టు, ప్రతి నమస్కారమైనా చెయ్యకుండా, మూట విప్పమన్నారు. ససేమిరా విప్పనన్నాడు కవి. పైగా మీ వేషం విప్పండని నన్నయభట్టు నడిగాడు. మాటకు మాట రెట్టించుకొన్నారు. జగడం. ఇంతలో తన సహజ వేషంతోటి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి వచ్చి, ముల్లెలో ఉన్నలిబ్బి శ్రీశ్రీ అనే రెండక్షరాలే అన్నాడు. శ్రీశ్రీకే ఆశ్చర్యమైంది. తనను తానే మోసుకొంటున్నాడా ఇంతసేపూ? ఆ మూటలో ఉన్నవి రెండే రెండు అక్షరాలైనా "మూటలో విప్లవం. మాటలుకలుస్తూ, విడిపోతూ, నాట్యంచేస్తూ, ప్రాకుతూ, మొగ్గలువేస్తూ, పాడుతూ, అరుస్తూ విప్లవం." ఇందులో అర్థంకావలసిందీ, కానిదీ ఏమిటి? "మంట ముళ్ళ డొంకలు, నెక్టైు, టైపు రైటరు, హంస" కవి మనస్సులోకి ఒకదాని తర్వాత ఒకటి వచ్చి, వచ్చినంతలో మాయమయ్యాయి. "నాకు వాటి అర్థంగాని అవసరంగాని అవగాహన కాలేదు" అని కవి అన్నా, "టైపిస్టు ఆంగ్లో ఇండియన్ హంస, నెక్టైతో ఆఫీసు మేనేజర్ తటస్థ పడితే లేచిన మంట ముళ్ళ డొంకలు అనూహ్యంకావు" అని విమర్శకుడు అంటున్నాడు. ('వాణి') అంతా అర్థం ఎట్లాగూ కాదు. కాని, కొన్ని జీవిత వాస్తవాలనే కవి శకల ప్రాయంగానైనా సక్రియలిస్టు కవితలో ప్రదర్శిస్తున్నాడను కోవాలి.

'మహాకవి ఆశ్చర్యం' అనే వచన గేయంకూడా ఇట్లాంటిదే. అందులో బోలెడన్ని ఉపశీర్షికలు. మిగత విషయాలతోబాటు సాహిత్యం ఇక్కడకూడా ముగ్గులోకి వచ్చింది. "అబద్ధం కాదు ఆశ్చర్యం" అని కవి ఎందుకనివుంటాడంటే, వాస్తవం ఏదో రూపంలో ఇక్కడ ఉంది కాబట్టే, అనుకొంటాను. లేకుంటే "మేగ్నాకేసు; మీరట్ కార్టా" ఏమిటి? ముందుది వెనక్కు తిప్పిచూస్తే, ఇది మేగ్నాకార్టా, మీరట్ కేసుగా అసలు రూపం ధరించి, బ్రిటిష్‌వారి ఆదిమ హక్కుల పత్రానికీన్నీ, ఇండియాలోని ప్రథమ కమ్యూనిస్టు పితూరీ కేసుకున్నూ అన్వయం కుదురుతుంది. వెనకనే చెప్పినట్టు, రూళ్ళ కర్రకు దారంకట్టి లాగుతున్న పందికొక్కులాంటి పొడుండొక్కు ('అధి వాస్తవికుల ప్రవేశం'లోని "ఉద్యమనాయకుడూ" ఈ తానులోని తుంటే.) కొత్త ప్రపంచపు పాటలను మెచ్చని బాపతు. ఛందస్సంబంధమైన

నియమాలు, గణాల గుణింతాలు తనకు నచ్చవని చెప్పేందుకు "శారదాబిల్లి" అనే ఉపశీర్షిక.

ఈ సప్రియలిస్టు ఖండికలు ఆమూలాగ్రం నాకు బోధపడ్డాయని కాదు. బోధపరచుకొనే ప్రయత్నమే ఉండాలి గాని బోధపడనివేవి ఉండవనే నేనంటున్నది. కవి లోపం కూడా ఉండవచ్చునని శ్రీశ్రీయే అంటున్నాడు. పైన పేర్కొన్న వ్యాసంలోనే, "అధివాస్తవిక రచనలను నేను తప్పుగా ప్రదర్శించి నటులైతే అది నాకృషిలోపమే గాని అధి వాస్తవికతా సిద్ధాంత లోపంకాదు" అని రాశాడు.

చిట్ట చివర, అనువాదాలు. ఇవి బోలెడున్నాయి. అంతేగాక చాలా బోలుగా ఉన్నాయని సమీక్షక ఉవాచ. కవిత్వాన్ని అనువదించడమే అసాధ్యమైన పని. రష్యన్ భాషలో రాసిన పుష్కిన్ కవిత్వంలోని అంత్యప్రాసలు వగైరా సొగసులు, ఇంగ్లీషు భాషాంతరీకరణం నుండి తెలుగులోకి వచ్చిన థర్డ్ హేండ్ రచనలు లేవని ఎత్తి చూపడం కంటె సులభమైన పనిలేదు. అనువాద మనేది మక్కీకి మక్కీగా గాక, స్వతంత్ర పంథాలలో జరిగితేనే మూలంలోని సొగసులు కొన్నైనా రాగలవు. ఉదాహరణకు, "The snows of yesteryear" అనే ఫ్రెంచికవి రచనకు 'ఏవి తల్లీ?' పేరుతో శ్రీశ్రీ చేసినది అనుసరణం కాబట్టే, ఎన్నో స్వతంత్ర రచనల కంటె మహత్తరంగా రూపొందింది. మయాకోవస్కీ రాసిన బృహద్గేయం 'లెనిన్'కు శ్రీశ్రీ చేసిన అనువాదం కొన్నిచోట్ల యథామూలంగా ఉన్నా, మరి కొన్నిచోట్ల విస్తరించిందని మూలాన్నీ అనువాదాన్నీ సరిపోలిస్తే తెలుస్తుంది. మయాకోవస్కీ "I clean myself by Lenin" అన్న చరణానికి, "లెనిన్‌లో స్నానంచేసి/ పునీతుణ్ణవుతున్నాను" అని శ్రీశ్రీ అనువాదం. ఈ అపరాధానికి ఉభయులనూ సమీక్షకులు తేలిక మాటలాడారు. మయాకోవస్కీని సమర్థించవలసిన అవసరం నాకిక్కడ లేదు.[6] కాని, శ్రీశ్రీ అనువాదం బాగోలేదంటేవీలులేదంటాను. ఇంగ్లీషు భాషాంతరీకరణం— Mayakovsky and His poetry (Herbert Marshall, 1955) చదివితే, ఇంగ్లీషు అనువాదం కంటె తెలుగుది ఎన్నోరెట్లు భేషుగ్గా ఉందంటాను. మంచి ఊపు, నడక చేకూరేట్లు శ్రీశ్రీ అనువదించాడు. అసలు మూలమే బాగోలేదనే వారికి ఈ వివరాలన్నీ ఇవ్వడం బధిరఘోష అవుతుంది.

6. "As a master poet, Mayakovsky was a promethean innovator and his unorthodox poetics is as effective as a sledge hammer."——An Anthology of Russian literature in the soviet [Period; Edited and Translated by B. G. Guerney.]
"A poet of genius"—The Penguin Book of Russian Verse.

"రవ్యష్టగీతి" రాసి, "పవ్యగ్రహేతి"ని చేసిన శ్రీశ్రీ శబ్దనేతృత్వం "పెంటగనుల తుంటరులు"లో కూడా కనిపిస్తుంది. Pentagon అనేది అమెరికాలో యుద్ధసచివాలయమని విమర్శకులకు తెలియకపోలేదు గాని, దానిని 'పెంట'గా చమత్కరించి శ్రీశ్రీ ఎందుకింత చులకనయ్యాడా అని వాళ్ళు నోళ్ళునొక్కుకుంటున్నారు. "నైకానోకహ విహారికాకంవలె, దుఃఖరాత్రి ఘూకంవలె" అనగలిగిన శ్రీశ్రీయే "పాతపీపా పీతపాపా" అనగలడు. సంస్కృత వ్యాకరణ సంబంధియైన 'అధ్యాహారం'తెచ్చి కావ్యంలో పెట్టగలంతటి దక్షుడే 'ఫిలోఫర్లు', 'ఫస్టోబరు' అని ఇంగ్లీషు వ్యాకరణాన్నికూడా తారుమారుచేసి కొత్త మాటలు సృష్టించగలడు. ఈ రెండూ తొలినుండీఉన్నవే. ఆ రెండూ చేరితేనే, వాటి కూడికలోనే శ్రీశ్రీ ఉన్నాడు. సుష్ఠుగా చదువుకొన్నవాడు, సందులో సాహసం చెయ్యగలవాడూను. "విశాఖపట్టణం పూరు/వెర్రాసుపత్రి పేరు"—తనను చూసి తానే నవ్వుకొంటున్నాడా? అలా నవ్వుకోవడమే మంచిది. Humour అని పేర్కొనబడే గుణం కవి శబ్ద వాచ్యుడైన ప్రతి వాడికీ అవశ్యం ఉండవలసిన గుణమని విమర్శకులంటారు.[7] అది శ్రీశ్రీకి పుష్కలంగా ఉందని ఈ సంకలనంకూడా నిరూపిస్తుంది. ఈ వ్యాసానికి చివర 'సామాన్యుని కామస'లోని ఈచరణం ఎంతచక్కగా అమరి పోతుందో చూద్దామా?

"ఒకటేశ్రీ అదే రెండు
అదే వేదు సిరీ అదే
అమరత్వం అసురత్వం
శ్రీశ్రీ ఒక మానవుడు."

రెండు గుణాలూ — పశుత్వమూ శిశుత్వమూ, దేవతాంశ, రాక్షసాంశ — ఎవనిలో కలగలసిపోయి ఉంటాయో అతడే మనిషి. అలా ఉండనివాడు దేవుడైనా కావాలి, దయ్యమైనా కావాలి. ఆ సగటు మనిషికోసమే ఆ మనిషి మనికిగురించే కళలూ శాస్త్రాలు।



(ఖడ్గసృష్టి—ఖండకావ్యం—శ్రీశ్రీ; ప్రచురణ, ప్రాప్తిస్థానం: విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరురోడ్డు, విజయవాడ—2; డెమీ 150 పేజీలు; వెల: రు. 2-50)

7. "Humor is the final sign and seal of seriousness, for it is a proof that reality is held in honour and in love"—Mark Van Doren.

# కృష్ణా జిల్లా రచయితల మహాసభ (1967 జనవరి 8) ప్రత్యేక సంచిక

(ప్రాప్తి స్థానం: శ్రీ కె. వీరభద్రశాస్త్రి, కార్యదర్శి–నవ్యసాహితీ సమితి విజయవాడ శాఖ, రామవరప్పాడు, వయా–విజయవాడ. వెల: ఒక రూపాయి)

పేరు చూడగానే అఖిలాంధ్ర రచయితలకి 'ఏమిటీ సంకుచిత స్వభావం' అనిపిస్తుందనీ, అదికేవలం అపోహ అనీ సంపాదకులు ముందు మాటలో సమర్థించుకున్నారు.

ఇందులో ప్రాచీన–నవీన పద్ధతులననుసరించి రచనలు చేసే రచయితల రచనలున్నాయి. వ్యాసాలు–కథలు–కవితలు–జాతి వైతాళికులుఅనే శీర్షికతో కృష్ణా మండల రచయితల పేర్లున్నాయి.

'కవితా మమ దేవతా', 'నవ్య, అభ్యుదయ కవిత్వ సింహావలోకనం'-కవిత్వానికి సంబంధించిన వ్యాసాలు అనుకునేవారికి ఆశాభంగం కలగొచ్చు. ఈ రెండు వ్యాసాల లోను ముప్పాతిక మువ్వీసం కవుల, రచనల పేర్లు ఆక్రమించాయి.

'నవ్యత్వానికి నోచుకోని తెలుగు నవలాసాహిత్యం' అన్నవ్యాసం నవనవంగా లేదు మరి. ఈ వ్యాసంలో రచయిత విమర్శకులను విమర్శించారు. నిజమే విమర్శలు తక్కువ స్థాయిలోనే వున్నాయి. తెలుగు నవల నవ్యత్వానికి నోచుకోక పోవటానికి objective reasons ఇచ్చి వుంటే బాగుండేది.

'మనకథా పరిశ్రమ' చెప్పదలచుకున్న దేమిటో? కథలు–కవిత్వం పోలుస్తూ రచయిత అన్నముక్కలు న్యాయంగా లేవు. కొన్ని పొడుగులైన్లు, కొన్ని పొట్టిలైన్లు జాగ్రత్తగా పేర్చుకుంటూపోతే కవిత్వమవదు. అది కవిత్వమని కవి అన్నవాడు ఒప్పుకోడు.

'భగవాన్ ఒక్కసారి వెనక్కి తిరుగు' కవి మానసికానుభవచిత్రణ. "భయంకర సంధ్యావేళలలో గుమ్మాల కంకితమై కూర్చున్న బిడ్డలు........కఠోర విలాపాశ్రువులధారిక లెండిన చెక్కిళ్ళతో తల్లి గుండె గోడలు బ్రద్దలు చేస్తున్నారు. 'వరకట్న రాక్షసీ కరాళ దంష్ట్రలమధ్య....... తమ పెండ్లివార్త కాలపురోదసీ చివరల్లో కరిగి పోయిన దౌర్భాగ్య కన్యాసహస్రాలు" వంటివి మచ్చుతునకలు.

'మెటమార్ఫోసిస్' నేటిప్రపంచ రాజకీయ వ్యవస్థకి చిత్రణ. గీతం చక్కగా వుంది. 'రాత్రి రేవ వ్యరం సేత్' గతానికీ ప్రకృతానికీ మధ్యజరుగుతున్న మానసిక సంఘర్షణ. ఉన్న కథల్లో 'తెలుగువాడికథ' బాగుంది.

—"విలోకి"

# కొత్తచిగుళ్ళు - చిగుళ్ళేనా? కొత్తవా?

కవిత్వాన్ని మాత్రం కొనకు—తినకు / అది ఉత్తమన్న
వేలుపెడితేచాలు తగుల్తుంది / ఎవడిదో కన్ను *

ఇటీవల కవితా సంకలనాలు విరివిగానే వస్తున్నాయి. 'కొత్త చిగుళ్ళు' పేరును బట్టి ఇందులో కవితలన్నీ కొత్తవనో, కొత్తవాళ్ళురాసినవనో అనుకునే అవకాశముంది. కాని చాలాభాగం వివిధ పత్రికలలో వచ్చినవే: కవులుకూడా చాలావరకు సుప్రసిద్ధులే. సంకలనకర్త అవన్నీ ఓచోట చేర్చారు. ఈ సంపుటికి ఆముఖంలాంటిదేమీలేదు. సంకలనకర్త పేరుకూడా ఒకచోట ప్రకాశకుడిగా, ఇంకోచోట సంపాదకుడి (editor)గా దర్శనమిస్తుంది. దాదాపు ఇరవై కావ్యఖండికలను ఏరి కూర్చిన కూర్పరి తన ఈ పూనికనుగూర్చి రెండు మాటలు చెప్పడం భావ్యంగా ఉంటుంది.

ఇందులో మాత్రాఛందస్సులో మెత్తగా పూలపాటలు పాడుకునే సోమసుందర్, ఏ సంప్రదాయానికిచెందిన కవులో ఎరుకపడని సంప్రదాయ కవులు దాశరథి, నారాయణరెడ్డి, ఇక ఓ దిగంబరకవి... ఇలా విభిన్న శాఖలకు చెందినవారు ఉన్నారు.

ఈ కదంబమాలను 'అచ్చమైనకవిగా జీవించే ప్రజాకవి' కాళోజీ గళసీమనలంకరించారు. వారిమీద ప్రశంసావాక్యాలు పొదిగిన ఓ గేయంకూడా ఇందులో పొందుపరచారు.

స్వాతంత్ర్యసిద్ధి తదుపరి ఏదో ఒరిగిపోతుందనుకున్నకవి చుట్టూ నిరాశా, నిస్పృహ అలముకున్నాయి. నల్లని ఊడల మర్రిచెట్టు క్రింద మొలుస్తున్న మొక్కల్లా కనిపించసాగారు తన తమ్ములు. చుట్టూ 'మానవతావస్త్రాలు వొలిచే దుశ్శాసనులు' 'సిగిరెట్లతో గులాబీలు తగులబెట్టే వాళ్ళ కళ్ళు కుళ్ళు కాల్వలుగా ప్రవహిస్తున్న లోకం', అందులో 'రకరకాల శూన్యభావాంబరధారులు' కనిపించసాగారు అడుగడుక్కీ. అందుకే అంటున్నాడోకవి ప్రజాస్వామ్యం ఒకళ్ళిస్తే పుచ్చుకునేది కాదు బలంలేనిజాతికది వరంకాదు, అని. కవి 'ఒంటరితనం శిబిరంగా, మౌనం కవచంగా, కర్తవ్యం ఆయుధంగా చిరునవ్వు రక్షణగా' సాగిస్తున్న పోరాటంలో తనఅంతరంగమే యుద్ధరంగమయింది. ఇందులో ఈ కాలపు అవ్యవస్థను, అశాంతిని, అసంతృప్తినీ ప్రతిఫలించే కవితలే చాలావరకు ఉన్నాయి. 'బనా నాకుతెలుసు' అంటూ బ్రతుకులో

---

* రంధిసోమరాజు 'కవిత్వాన్ని మాత్రం కొనకు', కొత్తచిగుళ్ళు.

తేజం వెలార్చే సూర్యబింబంకోసం ప్రతిక్షణం జీవితాకాశంపైపు చూస్తూన్న కవి రాబోయే కాలాన్ని ఆవాహనచేస్తూ ఆశావాదాన్ని ఊదే కవితలు కూడా ఒకటి రెండు లేకపోలేదు. కవి ఋణాల బండరాళ్ళు కప్పుకుని నీట మునిగిపోతున్న సంసారులను తింటూ ఉంటూ బిడ్డలను కంటూపోతూ భద్రంగా జీవించాలనికోరే జరుగుబాటుగాత్రంగాళ్ళనూ ఓ వాక్యంలో చిత్రించుకొని తృప్తిపడుతున్నాడు. ఈ లోకంలోకడుగు పెడుతున్న శిశువుతో ఇక్కడ తల్లిప్రేమ తప్ప కల్తీలేని సరుకేదీ దొరుకదని హెచ్చరిస్తాడో కవి. 'ఇక్కడంతా క్షామం' అంటూ ప్రారంభించి 'నాయకులు నానాగడ్డి కరుస్తున్నారు. పశువులు మేతలేక చస్తున్నాయి' అని నవ్వూ విషాదం ఏక కాలాన కలిగిస్తూ 'పెద్దలూ గద్దలూ తినేసినాక తోలూడదీసి వ్రేలాదేసిన గోమాతలా ఉంది దేశం' అంటూ రఫ్ స్కెచ్ గీస్తాడింకొక కవి.

ఈ తరుణంలో 'నిదురిస్తున్న తమ్ముల నుదుట ఎప్పుడు కాషాయారుణ ఉషస్సు ఉదయిస్తుందోనని వారికనులలో విప్లవరోచిర్జ్వాలలు ఎప్పుడు విప్పుడు పడునోయని కాచుక్కూర్చున్నాడు. 'ముసురుతున్న మా తమస్సు నీవైనా తుదముట్టించు' అంటూ జీవన సంగ్రామంలో వేసరినకవి ప్రమిదలో దీపం వెలిగించమంటున్నాడు నేటి బాలలను.' ఇది రెండు వైపులా వెలుగుతున్న కొవ్వొత్తి కథ' అంటూ భరత వాక్యం పల్కుతాడు కవి.

ఇందులో 'కవిత్వాన్ని మాత్రం కొనకు' అన్నకవితలో 'మంచినే మానవత్వంగా మొలకెత్తు' అన్నాడు కవి. అర్థం దురవగాహంగా ఉంది. మొలకెత్తు' అకర్మకక్రియ. అందుకని జాగ్రత్త అవసరం. అక్కడక్కడ అచ్చు తప్పులు సవరించి ఉంటే బావుండేది. ఏమైనా ఈ పూనికకు శ్రీ బుచ్చిరెడ్డిని అభినందిస్తున్నాను.

—'పురహర'.

(కొత్త చిగుళ్ళు: కవితాసంకలనం; వెల: ఒక రూపాయి. సంకలనకర్త: గంగుల బుచ్చిరెడ్డి. ప్రకాశకులు: గంగుల బుచ్చిరెడ్డి 5/583/1 కిషన్‌పురా వరంగల్—1.

---

స్వీకారం:

1. గంటలు – కవితాసంపుటి – కరెళ్ళ సత్యనారాయణమూర్తి, ఎమ్, ఎ; ప్రాప్తి స్థానము: నల్ల మల్లికార్జునరావు, నల్లవారి వీధి, కాకినాడ–2; డెమీ 134 పుటలు; వెల రు. 2-50

2. నివేదన – నళిని గీతికలు (బాలాంత్రపు నళినీకాంతరావు) ప్రచురణ: ఆంధ్ర మహిళాసభ, మద్రాసు–4; క్రౌన్ 144 పుటలు; వెల రు. 3–50

# సృజన ప్రకటన రేట్లు

| | |
|---|---|
| ఆఖరి కవరు పేజి | రు. 125 |
| లోపలి ,, ,, | రు. 100 |
| లోపలి పూర్తి సాదా పేజి | రు. 75 |
| ,, సగము ,, | రు. 40 |
| ,, పావు ,, | రు. 25 |

**సృజనాత్మక ప్రకటనలకు సృజన**

# వచ్చే సంచిక మచ్చుతునకలు కొన్ని

ఆధునిక సాహిత్యంలో ఆధ్యాత్మిక చింతన

శ్రీశ్రీ

'మహాప్రస్థాన' కావ్యమీ[illegible]స

కుందుర్తి

అగతానికి శుభారంభం (కవిత)

సోమసుందర్

తీరిన కోరిక (కథ)

నవీన్

కాళోజీ 'నా గొడవ' సమీ[illegible]

ఆర్. ఎస్. సుదర్శనం

ఇంకా ప్రసిద్ధ రచయితల, ప్రయోగశీలుల విమర్శలు, కవితలు, కథలు.